JAGATI Rs. 2-00 January 1989

34th Year of Publication

# జగతి

ఎడిటర్: చందూర్

జనవరి – 1989



'తల అడ్డం – పక్క సీటులో కూచుంటారా ?'

—'సోవియట్ భూమి' సౌజన్యంతో

'జగతి' – 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు – 60000
ఫోన్ : 76697 – చందా 2 సం॥లకు రు. 45-00. – 5 సం॥లకు రు. 100-00 జీవి
చందా రు. 300-00. పాట్రన్ – రు. 1000-00 విదేశాలకు 2 సం॥లకు రు. 100-0

ముఖచిత్రం : బాలమురళీ కృష్ణ

# నిమ్మతొనలు

శంకరం, నీకు బుద్ధుందా లేదా? నీ కంటె పదేళ్ల పెద్దదైన శకుంతల నెందుకు చేసుకున్నావోయ్ - ఈ దేశంలో ఆడపిల్లలే కరువైనట్లు ?' - అని నిలదీసి అడిగాడు సుందరం.

'దానికో కారణం ఉంది' - అని సణిగాడు శంకరం.

'కారణమా ? పెళ్లికిముందే నెల తప్పిందా ?'

'ఛ ఛ - ఆమె అలాటిది కాదు. వోల్డ్ ఈజ్ గోల్డ్ అనే సిద్ధాంతాన్ని నేను నమ్మిన వాడిని గనక, ఆ సిద్ధాంతం ప్రకారం చేసుకున్నాను' - అని శంకరం చెప్పేసరికి సుందరం తెల్ల బోయాడు.

—జి మాధవీరామ్
నందిగామ

నీవు చేసిన నేరానికి నీకు ఉరిశిక్ష ఖాయం చేశారు. జీవితంలో చివరి కోరిక ఏదైనా ఉంటే చెప్పుకో - అన్నాడు జైలు సూపరెంటు ఖైదీతో.

"నాకు ఒక్కటే కోరిక ఉన్నది, సార్. ఒలంపిక్స్‌లోమనదేశం బంగారు పతకం పొందడం చూడాలని! అదే నా చివరి కోరిక" - అన్నాడు ఖైదీ.

—సి సత్తిబాబు
కోరుకొల్లు

సహార్యం, కమలాటాకీస్‌లో ఆడుతున్న పిక్చరేమిటి ? - అని అడిగింది జానకమ్మ.

"నీకూ నాకూ పెళ్లంట"

"ఇదేం దుర్బుద్ధి నీకు ? ఇద్దరు పిల్లలతల్లిని పట్టుకు యింత మాట అనడానికి నీకు నోరెలా వచ్చింది ?" - అంటూ విజృంభించింది జానకమ్మ

"మేడమ్, మీరు నన్ను పొరబాటుగా అర్థం చేసుకుంటున్నారు. అది ఆ పిక్చర్ టైటిల్."

"నిజంగా ? ఇవేం పేర్లు బాబూ" - అని చల్లబడింది జానకమ్మ.

—యమ్వీ రాజు
పొన్నమండ

అద్దెకున్న యింట్లోమంచినీళ్ళకుళాయి లేని కారణంగా, నర్మద, సుభద్ర ప్లాస్టిక్ బిందెలతో వీధిపంపు దగ్గరికి వచ్చారు. ఉదయం ఆరున్నరకి నీళ్లొచ్చే రివాజు. బిందెలు క్యూలో పెట్టి ఎంతసేపు కబుర్లు చెప్పుకున్నా గంగా భవాని దర్శనం కాలేదు.

"ఏడయింది - యింక యివ్వాళ నీళ్లు రావేమో!" - అంది నర్మద.

"ఏం చెప్పగలం - మన రైళ్లకీ బస్సులకీ వుండే అలవాటే ఈ నీటి పంపులకి వచ్చిందేమో!" - అంది సుభద్ర.

"అవునర్రా - అలా
పోతే మన బిపి పెరుగుతుంది" - అందొక పెద్దావిడ.

—బి జేసుదాసు
కొండపల్లి

గోవిందూ, మన దగ్గరకెవరూ సాధారణంగా రారు - కాని, ఒక్కరు మాత్రం విధిగా వస్తారు. ఆ 'ఒక్కరు' ఎవరో చెప్పుకో? - అని క్విజ్ ఇచ్చాడు కుమార్.

"ఇంట్లోనా, వీధిలోనా ?" - అని ఎదురు ప్రశ్న వేశాడు గోవిందు.

"వీధిలో"

"నిలబడి వుండగానా, కదులుతూ వుండగా ...."

"కదులుతూండగా"

"ఓస్ - అయిదోక్లాసు కుర్రాడు కూడా చెప్పగలడు. కదులుతూ వుండగా మన దగ్గర కొచ్చేది బస్ కండక్టరు ఒక్కడే ...."

—సి నాగేశ్వరరావు
సికింద్రాబాదు-3

త్రివిరి యిసుమున దైలంబు దీయవచ్చు'.... ప్రయత్నం చేస్తే యిసుక లోనుంచి కూడా నూనె తీయవచ్చు - తెలుసా ? - అని చెప్పారు టీచరు.

"సార్, రేపట్నుంచి పుస్తకాల బదులు యిసుక తీసుకురమ్మన్నారా ?" - అని అడిగాడు రాంబాబు.

—బి వెంకటేశ్వరరావు
రుద్రారం

నీ పెళ్ళి ఉంగరం నాలుగో వేలుకి పెట్టుకోవాలి గాని చూపుడు వేలుకి పెట్టుకున్నావేమిటి ? అది కరెక్ట్ కాదు - రాంగ్ - అన్నాడు సుదర్శనం.

"నాకు తెలుసునోయ్ - నేను రాంగ్ చేశానని మా ఆవిడకి గుర్తు చేసేందుకే, చూపుడు వేలికి తగిలించాను" - అన్నాడు శ్రీధర్.

—వై వి రమణ
చీరాల

# పాఠకుల తీర్పు

చందూర్ గార్కి నమస్కారములు. ఈ నెలాఖరుకి మద్రాసు వస్తాను - ఇక నుంచి అక్కడే ! .... ప్రతి నెలా 'జగతి' చదువుతున్నాను. మీ రచనా శైలిలో ప్రత్యేకత ఉన్నది. చదువు తూంటే, - మద్రాసు, ఆ పరిసరాలు, ఆప్తులు, పరిచయస్తులు - కళ్ల ముందు కదులుతూంటారు. ఎదురుగా కూచున్న మిత్రునితో మాట్లాడుతున్నట్లు వుంటుంది. అందుచేత ఎలాంటి పరిస్థితులతో నయినా తప్పకుండా చదువుతాను.... మీ నేస్తం.

—డియస్ లింగం

టోక్యో

'జగతి' సంపాదకులకు అనేక నమస్కారములతో.... అక్టోబరు సంచిక ముఖచిత్రం చూసి చాలా సంతోషం కలిగింది. మీరా నాయర్ ప్రతిభావంతురాలైన మహిళా దర్శకురాలు. తెలుగు సినిమా పత్రికలు చేయనిది మీరు ధైర్యంగా చేశారు. అసలు 'ది న్యూ యిండియన్ సినిమా' అనేది ఒకటి వుందని మన వాళ్లకు తెలుసా? మరొక సారి అభినందనలు.

— సరోజినీ ప్రేమ్‌చంద్

మద్రాసు-28

శ్రీ చందూర్‌గారికి వందనములతో వ్రాయునది. దాదాపు ఏడాది నుంచి నేనూ, విజయలక్ష్మి, హైదరాబాదు మ్యూజియమ్ వారు మాకు వప్పగించిన, శ్రీశైలం పెవిలియన్ అర్ధ శిల్పాలు తయారు చేస్తూ, యిక్కడ వుండిపోయాము.... 'నిమ్మ తొనలు' పుల్ల పుల్లగా వుండవచ్చునేమోగాని 'ప్రాచీన సాహితి' మాత్రం ఒక తీపి పదార్థం

—పిలకా నరసింహమూర్తి

హైదరాబాదు

శ్రీ చందూర్ గార్కి : నమస్తే.... నేను గుర్తున్నానో, లేదో.... ఒకసారి మీరూ, మేడమ్ మాలతి గారూ హైదరాబాదు 'ఎ ఐ ఆర్' కి వచ్చినప్పుడు కలిశాను. మాలతి గారితో రేడియోకి ఇంటర్‌వ్యూ కూడా చేశాను. ప్రస్తుతం ఇక్కడి 'ఆకాశవాణి' లో వుంటున్నాను.... చాలా రోజులుగా, ఆ మాటకొస్తే చాలా నెలలుగా, మీకు వ్రాయాలను కుంటున్నాను. ప్రతినెలా 'జగతి' చదువుతాను - పత్రిక తెరవగానే నేను వెతికేది మీ 'డైరీ'.... మీతో పాటే ఆయా ప్రదేశాలకీ, ఆయా మనుషుల మధ్యకీ మమ్మల్ని కూడా తీసుకుపోతూంటారు.... భవదీయ

—జీడిగుంట రామచంద్రమూర్తి

కడప

# పాచీన సాహి

పరహింసా పరకీయ విత్త హరణా భావంబు సత్యవ్రతా
దరముం దానపరత్వ మన్యవనితో దంతోక్తి మూకత్వముం
బరతృష్ణా ఝురభంజనంబు గురునమ్రత్వంబు నుం బ్రాణ భృ
త్కరుణా శాస్త్ర సమత్వ సద్విధులు భద్రప్రాప్తికి న్మార్గముల్

— భర్తృహరి



పండిన తరునకు బక్షులు సనునట్లు
వితరిణి కడ కేగు విద్య లెల్ల
బల్లంబునకు నీరు ప్రవహించు చందాన
నీతి మంతుని జేరు నిఖిల సిరులు
తల్లి యున్న యెడకు తనయు లేగెడు గతి
దయ గల చోటికి ధర్మ మరుగు
కడు రూపవంతుని గన్య గోరెడు మాడ్కి
నుత్తమ వ్రతు గోరు ముక్తికాంత
ధరణి మీదను సన్మార్గ సరణిదెలియ
గరిమ మిము గొల్వ నన్నియు గల్గు నిజము
ప్రణుత ధవళాంగ మౌనిహృత్పద్మ భృంగ
అమిత భవభంగ శ్రీ కాళహస్తి లింగ

— కాళహస్తి లింగశతకం



అరయగ ధర్మతంత్రల యందు నిరర్థము లే దొకండు నె
వ్వరి మది యెందు వ్రాలె దగ వారలు దానిన పూని యాచరిం
తు రదియ వారి కిష్టఫల దోహన కార్యమొనర్చు నెల్లెడం
బురుషుల జూడమే తమకు బోలిన ధర్మములన్ వెలుంగగన్

— తిక్కన 'మహాభారతం'

# ఎ కేళనా పిక్చర్

## బంగారు నెమలి
## 'గామ్ పెరాలియా'

అంతార్జాతీయ ఫిలిమ్ ఫెస్టివల్‌లో ప్రథమ బహుమతి పొందిన ఈ చిత్రంలో, శబ్దమూ ఛాయా సంగీతంలో ఐక్యత నొందాయి - అని ప్రశంసించాడు సత్యజిత్ రే. చిత్ర నిర్మాణంలో అనేక విధాల ఎంతో ముందంజ వేసిన దేశాలముందు, శైశవ దశలో వున్న సిలోన్ (శ్రీలంక) తన ప్రత్యేకత, వ్యక్తిత్వమూ నిరూపించుకొంది. 51 చిత్రాల పోటీలో ఈ శ్రీలంక చిత్రం ప్రథమ స్థానం పొందగలగడం నిర్మాత ఆంటన్ విక్రమ్ సింగ్‌కీ, డైరక్టర్ వెస్టర్ జేమ్స్ పెలీస్‌కీ ఎంతో గౌరవ ప్రదమూ, గర్వకారణమూను. ఇందరి మన్నన పొందిన చిత్రం అంత చిన్నదేశం నుంచి వచ్చిందీ అంటే, ఈ విజయానికి తోడ్పడిన కళాకారులూ సాంకేతిక నిపుణులు అభినందనీయులు. సామాజిక వాస్తవికతను, మదిలో మెదిలే ఆదర్శాన్ని విడనాడకుండా, చైతన్య కారకమగు మానవతాగీతం పలికే చిత్రమిది. కన్నీటి తుంపరలు లేకుండా మానవత మేల్కొనదు.... నందా (పుణ్యా హేండౌనియా) ఒక టీచరు వద్ద యింగ్లీషు పాఠాలు నేర్చుకుంటూ వుంటుంది. అతను పేదవాడు; పాఠాలు చెప్పుకు బతికే సామాన్యమైన టీచరు. కాని, మంచి మనసు గలవాడు. నందా తండ్రి గ్రామ పెద్ద - సంపద, అధికారం, అంతస్థు వున్నాయి. వారి ప్రేమను అతను అంగీకరించకపోవడం సర్వసాధారణం - అదే జరుగుతుంది. ఈ నందా, తండ్రి మాట కాదనలేక, ఆయన యిష్టప్రకారమే, పెద్దలు కుదిర్చిన సంబంధం, తమ అంతస్థుకి తగినవాణ్ణి చేసుకుంటుంది. తనగుండెని భగ్గుమనిపించిన ఈ గ్రామం నుంచి, గ్రామ వ్యవస్థనుంచి దూరంగా కొలంబో వెళ్లిపోయి, ధనార్జనే ధ్యేయంగా బతికి, సంపన్నుడవుతాడు టీచరు.... కాలగతితో గ్రామస్వరూపం మారుతుంది. బొటనవ్రేళ్లను పవిత్రో దకంతో, ఏకం చేసిన వివాహబంధం కూడా వెనకటి విలువలు

కలప వ్యాపారం చేసి పుష్కలంగా సంపాదించగలననుకొన్న నందాభర్త జయరామ్, నిరాశతో ఆస్పత్రిలో మరణిస్తాడు. నందాకు పుట్టిన పిల్లవాడు మంత్రసాని అశ్రద్ధవల్ల మరణిస్తాడు. ....ఒంటరిదైననందాను సంపన్నుడైన ఆ టీచరు దగ్గరకి తీసుకో వచ్చుగాని వారి వెంట నంటి వుండే దుస్స్వప్నానికి కారకులెవరు ? మారుతున్న వ్యవసా? మనుషులలోని జడత్వమూ అజ్ఞానమూనా?

—యవ్వార్ చందూర్ సమీక్ష

'జగతి' - జనవరి, 1965

# వెన్నెల కెరటాలు

## 'గౌతమి' సన్నిధానం

తణుకులో జరిగిన ఆంధ్రప్రదేశ్ గ్రామీణ గ్రంథాలయ మహాసభల సందర్భంగా సన్నిధానం నరసింహ శర్మగారికి 'ఉత్తమ గ్రంథాలయోద్యోగి' సత్కారం చేశారు. ఇది వారి ఔదార్యం ఎంతమాత్రం కాదు. ఆ సంస్థ తమ విధిని నిర్వహించారు - అంతే. సన్నిధానం వారిని గ్రంథాల గౌతమీ శర్మ అని పిలుస్తారు. ఎవరెలా పిలిచినా గౌతమీ గ్రంథాలయం పేరుని బట్టి వారికి గుర్తింపు ఉండేది. కాని రానురాను వారి పేరును బట్టి గౌతమికీ పేరు వచ్చిందంటే అతిశయోక్తి కాదు. చెప్పేదేమంటే ఒకరి పేరుకాకరు పర్యాయపదంగా మారారు. సన్నిధానం వారికి రెండు సంసారాలు. ఐనా ఎక్కడి బాధ్యతలు అక్కడ సంతృప్తిగా నిర్వహిస్తారు. గ్రంథాలయాన్ని తమ సంసారం కన్న మిన్నగా చూస్తారు. గౌతమి ఆయనకు తల్లి. అందులోని పుస్తకాల్ని ఆయన సొంత బిడ్డల కన్నా ఎక్కువ బాధ్యతగా చూస్తారు. గత ఇరవైఏళ్ళ నుండి ఆయన గౌతమిని కనిపెట్టుకుంటూ వస్తున్నారు. గ్రంథాలయంలో పనిచేసే బాలామంది కేవలం ఉద్యోగం చేస్తారు. సన్నిధానం వారు మాత్రం సేవ చేస్తారు. సేవ చేయడానికి అన్ని అర్హతలున్న వారు. సేవకి నిబద్ధత ముఖ్యం. ఆయన వృత్తీ ప్రవృత్తీ గౌతమికి అంకితం చేశారు.

—అదిత్య

'కోస్తావాణి'లో

## స్వయంకృతాపరాధం

మానవుడు స్వయంగా సృష్టించుకున్న రెండు భయంకర సమస్యలు - ఒకటి భయానక అణ్వస్త్రాల ఉత్పత్తి, రెండవది జనాభా విపరీతమయిన పెరుగుదల. మానవాళి అస్తిత్వానికి ముప్పు తెచ్చిపెట్టుతున్న స్వయంకృతా వరోధాలు ఇవి. ప్రపంచ మంతటా, విశేషించి తృతీయ ప్రపంచపు పేద దేశాలలో జనాభా భయంకరంగా హెచ్చుతున్నదని ఇటీవలి అంచనాలు వెల్లడిస్తున్నాయి. 1987వ సంవత్సరం మధ్యభాగం నాటికి అనగా జూలైనాటికి ప్రపంచ జనాభా అయిదువందల కోట్ల స్థాయికి వచ్చిందని జనాభా కార్యకలాపాల ఐక్యరాజ్య సమితి నిధి సంస్థ అంచనా వేసింది. ఈ సంఖ్య మరో పదకొండు

పంవత్సరాలలో, అనగా 1999 నాటికి ఆరువందలకోట్ల [illegible]కి వస్తుంది. జనాభా పెరుగు[illegible] ఇంత తీవ్రంగా ఉంటున్నది గనుక ప్రపంచ మంతట, ముఖ్యంగా ఆసియా, ఆఫ్రికా, లాటిన్, అమెరికా పేదదేశాలలో ప్రకృతి వనరులు, సంపదలు, పరిసరాల పారిశుధ్యం, ప్రజల ఆరోగ్యం, ఆర్థికాభివృద్ధి, సామాజిక ప్రశాంతి, రాజకీయ సుస్థిరత్వం, ప్రజాస్వామ్య సూత్రాలు తీవ్రంగా దెబ్బ తింటాయని జనాభా విషయాల అంతర్జాతీయ నిపుణులు అభిప్రాయ పడుతున్నారు.

—డి ప్రభాకరరావు
'యోజన'లో

## జీడిమామిడి

జీడిమామిడి సమశీతోష్ణమండలపు [illegible] - అనగా పూర్తి సూర్యరశ్మిని ఉపయోగించుకొని ఎల్లప్పుడు పచ్చని ఆకులతో ఉంటుంది. మనదేశంలో ఇది దక్షిణ, తూర్పు, పడమరతీరంలో స్వతస్సిద్ధంగా వ్యాప్తి చెందింది. కాని దీనికి వీలైనంతవరకు సముద్రానికి వంద కి. మీ. దూరముండు ప్రదేశాలు అనుకూలం. ఇది మనరాష్ట్రంలో మెదక్, ఆదిలాబాద్, చిత్తూరు జిల్లాల్లో కూడా కొంతమట్టుకు పెరుగుతుంది. కాని మొక్కలు సముద్రతీరంలో కాచినట్లు కాయవు. గాలిలో నీటి చెమ్మ ఉండుట అవసరం. ఇది కొండ[illegible]ంలో మూడువేల అడుగుల సముద్రమట్టంపైన కూడా పెరుగుతుంది. జీడిమామిడి స్వస్థలం బ్రెజిల్ దేశం మనదేశంలో దీనిని 16వ శతాబ్దంలో పోర్చుగీసువారు పడమట తీరంలో ప్రవేశపెట్టారు. దీనిని మొదట సముద్రతీరం పొడవున నేల కోతను అరికట్టుటకు నాటినట్లుగా తెలుస్తుంది. ఆంధ్రప్రదేశ్ అటవీ అభివృద్ధి సంస్థ 1978వ సంవత్సరం నుండి ప్రపంచబ్యాంకు ఆర్థిక సహాయంతో చిత్తూరు, నెల్లూరు, ప్రకాశం, గుంటూరు మరియు పశ్చిమగోదావరి జిల్లాలలో ఎక్కువ విస్తీర్ణంలో జీడి మామిడి తోటలు పెంచుతున్నారు.

—యస్ ఈశ్వరరెడ్డి
'అన్నదాత'లో



భాగ్యవంతుడంటే ఏమిటో అనుకుంటారు మీరు - డబ్బుగల బీద వాడు.

—ఫీల్డ్స్

స్త్రీలని ఆక్షేపించే పురుషులు, ఎవరో ఒక స్త్రీని మనసులో పెట్టుకు ఆవిసుర్లు విసురుతారు.

—గోర్కాంట్

కాగడా చేతబుచ్చు కున్నవారు, దానిని తప్పకుండా పక్క వాళ్ళకి అందిస్తారు.

—ప్లేటో



# మానవ ప్రగతి

## అంతరిక్ష విజ్ఞానం

భవిష్యత్తులో చంద్రుడి పైన నివసించే వారిని ఉల్కాపాతం నుంచి రక్షించేందుకై రూపొందించిన 'ప్రెషర్ సూట్' లు....నీటికి బాగా దిగువన విహరించడానికి అవసరమైన సాధనాలుగా రూపాంతరం చెందాయి. విమానాల ఇంధన వినియోగ సామర్థ్యాన్ని పెంపొందించేందుకై రూపొందించిన ఒక సాంకేతిక ప్రక్రియను వినియోగించడం ద్వారా 'స్టార్ అండ్ స్ట్రయిప్స్' పడవ 1987 లో 'అమెరికా కప్ యాచ్‌రేస్' లో విజయం సాధించింది. అంతరిక్ష నౌకలలోని పరికరాలకు విద్యుత్ సదుపాయం కల్పించేందుకు తయారు చేసిన 'ఫొటో వోల్టాయిక్ సెల్స్' ఇప్పుడు ఆఫ్రికా, ఆసియా దక్షిణ అమెరికాలోని ఆస్పత్రులలో రెఫ్రిజిరేటర్లకు అవసరమైన శక్తిని అందజేస్తున్నాయి. మొదటవ్యోమ, వైమానిక (ఏరోస్పేస్, రంగాలలో 'పుట్టిన' ప్రక్రియలు. అటు పిమ్మట ఇతర రంగాలకు సైతం ఎంతగా మేలు చేస్తున్నాయో చెప్పడానికి ఇవి కొన్ని ఉదహరణలు మాత్రమే. గత 27 సంవత్సరాలలో అంతరిక్ష సాంకేతిక పరిజ్ఞానం ఇతర రంగాలలో 30 వేల రకాలుగా ఉపయోగపడిందని అమెరికా వ్యోమ, వైమానిక సంస్థ (నాసా) కు చెందిన ఏరోస్పేస్ నిపుణులు తెలియజేశారు. వ్యోమ, వైమానిక ప్రక్రియలు 'చొరబడని' దైనందిన జీవన రంగాన్ని పేర్కొనడం చాలా కష్టమని వారన్నారు 'నాసా' కనుగొన్న 4 వేలకు పైగా ఇట్టి ప్రక్రియలు (పేటెంట్ ప్రక్రియలు) ఇప్పుడు 'లైసెన్సింగ్' కి అందుబాటులో వున్నాయి. ఈ మధ్య జరిగిన మరొక పురోగతిలో – 'నాసా' పరిశోధకులు, జాన్ హాప్కిన్స్ విల్మెర్ ఐ ఇన్‌స్టిట్యూట్ శాస్త్రజ్ఞులు కలిసి సూక్ష్మమైన కలర్ టెలివిజన్ తెరలు కలిగి వుండే కొత్తరకం కంటి అద్దాలను రూపొందించేందుకై అయిదేళ్ల ప్రణాళికను ప్రకటించారు. ఇప్పటి సంప్రదాయికమైన కంటి అద్దాలకు బదులుగా వినియోగంలోకి వచ్చే ఈ కొత్తరకం

'ఐ గ్లాస్' లు చూపు దెబ్బతిన్న 25 లక్షల మందికి సాధారణ దృష్టిని పునరుద్ధరించ గలుగుతాయి. రాకెట్ ఇంజన్ల లోపలి భాగాల పనితీరును కనిపెట్టి చూసేందుకై తయారు చేసిన 'స్పేస్ గ్లాసెస్' పరిజ్ఞానంతో రూపొందే ఈ కొత్తరకం కంటి అద్దాలు రాత్రి వేళలలో కళ్లు కనిపించని వారికి దృష్టిని ప్రసాదిస్తాయి. అత్యాధునిక విమానాల కోసం తయారుచేసిన అధిక విశ్వసనీయమైన, తేలికపాటి, చిన్న టెలివిజన్ ట్యూబ్‌ల పరిజ్ఞానంతో ఇప్పుడు వాణిజ్య సరళిలో చిన్న చిన్న టెలివిజన్లు మార్కెట్‌లోకి వచ్చేశాయి. చంద్రుడి పైన పరిశోధనలు జరపగలిగేందుకు తోడ్పడే విధంగా రూపొందించిన 'లూనార్ రోవర్' వాహనానికి సంబంధించిన సాంకేతిక పరిజ్ఞానం ఇప్పుడు బాగా వికలాంగులైన వారు సైతం రహదారుల పైన వాహనాలను నడపడానికి దోహదం చేస్తున్నది.

## చేపలు

కంటికి మహా కఠినము, అంతరాల్లో అతిమధురము ఇది సముద్రాల్లో దొరికే ఒక రకమైన చేప లక్షణము తీర ప్రాంతాల్లో ప్రధానంగా దొరికే ఈ రకమైన చేపలు అత్యధిక ఎగుమతి విలువ గలిగి ఎంతో మందికి ప్రియమైన ఆహారము. పెంకు చేపలజాతికి చెందిన ఈ చేపలకు అంతర్గతంగా మాత్రమే పెంకు ఉంటుంది. దీన్ని తాజాగానే ముఖ్యంగా ఊరగాయల వంటి రీతిలో ఉపయోగిస్తారు. మంచులో నిలవ ఉంచి గడ్డ కట్టించబడిన ఈ రకమైన చేపలను ఎగుమతి కూడ చేస్తుంటారు. కొన్ని రకాలైన ఇదే జాతికి చెందిన చేపలు మహా సముద్రాల్లో కూడా లభ్యమవుతాయి. సముద్ర ఆహార వనరులలో రొయ్యలు, కాలిఫోర్నియా జాతి పెద్ద రకం చేపలు, మహా సముద్రపు స్క్విడ్ చేపలు ప్రధానమైనవి. అయితే ప్రస్తుతానికి స్క్విడ్ చేపలను అంత ప్రయోజన కరంగా వాణిజ్యావసరాలకు ఉపయోగించటం లేదు. 1970 ప్రాంతంలో ఉత్తర అరేబియన్ సముద్ర ప్రాంతంలో ఈ స్క్విడ్ చేపలు ఎక్కువగా కనుగొనబడినవి. ఆ ప్రాంతంలో పరిశోధనలు చేస్తున్న ఒక జపాన్ ఓడసిబ్బంది ఈ విషయాన్ని కనుగొంది. నైరుతి తీర సముద్ర ప్రాంతంలో భారతీయ పరిశోధనా నౌక 'వరుణ' కూడ ఈ స్క్విడ్ చేపల నమూనాలను కనుగొనడం జరిగింది.

## ఆయుధాలకు

ప్రజల అవసరాల మీద కన్నా ఆయుధాలమీద అధికంగా ఖర్చు పెట్టడం, అనేక దేశాల్లో అధిక జనాభా సమస్య, జీవ్యావరణ సమస్యలు. వీటన్నింటిలోకి ఆయుధాలమీద పెడుతున్న భారీ ఖర్చులకు, పెరుగుతున్న పేదరికానికీ మధ్య ఎంతో అవినాభావ సంబంధం వుంది. మనం మారణాయుధాల్ని కనుక నిర్మూలించగలిగితే

## నెహ్రూవాణి

అవక తవకలు లేకుండా రుజు మార్గాన నడుచు కొంటుందనే విశ్వాసం కలిగించడమే పాలనా వ్యవస్థకు ప్రధానాంశం

—1958 జనవరి 06

అందువల్ల ఆదా అయ్యే నిధులతో ఆకలిని నిర్మూలించడానికి, అనేక పేద దేశాల ఆర్థిక వ్యవస్థను మెరుగుపర్చడానికీ వీలవుతుంది. భారీస్థాయిలో నిరాయుధీకరణను సాధించనిదే ఆకలిని లేని ప్రపంచాన్ని సాధించడం సాధ్యంకాదు. దురదృష్టవశాత్తు, ప్రపంచంలోని అనేక దేశాలు తమ ఆర్థిక వనరుల్లో అధికభాగాన్ని ఆయుధాల తయారీకి, కొనుగోలుకు మళ్లిస్తున్నాయి. ఈనాడు ప్రపంచం ప్రతి ఏటా ఆయుధ పోటీపైన ఒక ట్రిలియన్ డాలర్లను ఖర్చు చేస్తోందని అంచనా. దాదాపుగా 100 మిలియన్ల మంది సైనిక సంబంధమైన కార్యకలాపాల్లో నిమగ్నమై వున్నారు. ప్రపంచంలోని శాస్త్రవేత్తలు, ఇంజనీర్లలో 40 శాతం మంది సైనిక సంబంధమైన పరిశోధనల్లో మునిగి తేలుతున్నారు. వర్ధమాన దేశాలను ప్రత్యేకించి యీ సైనిక భారం మరింత కృంగదీస్తోంది. ప్రపంచ ఆయుధ దిగుమతుల్లో తృతీయ ప్రపంచ దేశాల వాటా 75 శాతం వుంది. దీని మూలంగా వీటి అభివృద్ధి ప్రణాళికలు దెబ్బతింటున్నాయి. బడ్జెట్లు ఈ భారంతో గిలగిలా తన్నుకుంటున్నాయి.

# కొత్త పుస్తకాలు

'రష్యాలో స్నేహయాత్ర' - వాసా ప్రభావతి. వాసా ప్రచురణలు, మలక్ పేట, హైదరాబాదు - 36. వెల : రు 10 - 00.

'ఇస్కస్' వారి కార్యక్రమంలో సోవియట్ రష్యా పర్యాటకులకు కొన్ని సదుపాయాలు వున్నాయి. వారు వేర్వేరు రాష్ట్రాల నుంచి బృందాలుగా వెళ్తారు; ఒకొక్క బృందంలో పది పన్నెండుగురు మాత్రమే ఉంటారు; ప్రతి బృందానికీ ఒకరిద్దరు గైడ్స్; తాష్కెండులో విమానం నుంచి దిగి నప్పట్నుంచీ, మళ్లీ అక్కడ విమానం ఎక్కించే దాకా ఆ గైడ్స్, పర్యాటకులకు ఎటువంటి అసౌకర్యమూ కలగకుండా వెంటనుంటారు. దుబాసీ పక్కన లేకపోతే, భాష తెలియని కారణంగా టూరిస్టులు యిబ్బంది పడవలసి వస్తుంది. ఈ బృందాలు వెళ్లే ముందు మీటింగులూ, వచ్చాక మీటింగులూ 'ఇస్కస్' కార్యక్రమావళిలో ఒక భాగం. డా॥ సుంకు బలరాం, ఆయన సతీమణి అన్నపూర్ణ, ఆంధ్రాబాంక్ కెవి భాస్కరరావు, కిన్నెర ఆర్ట్ రఘురాం, సాయికుమార్, సత్యనారాయణ గుప్త మున్నగు వారు వాసా ప్రభావతి వున్న బృందంలోని వారు - తనను ఎంతగానో అభిమానించిన సుంకు బలరాం దంపతులకు ఈ పుస్తకం కానుకగా యిచ్చారు రచయిత్రి.

తలనెప్పి, పళ్ల నెప్పికి మందులు పట్టుకెళ్లమని తమ్మారెడ్డి కృష్ణమూర్తి సలహా, రెండు సార్లు సోవియట్ యూనియన్ సందర్శించి వచ్చిన నారాయణరెడ్డి హితవచనం - యిలా టివయాక, ఆంధ్రా ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీ చేరుకు, ఎ. బి గ్రూపుల తికమకతో, ఆఖరిక్షణాన ఏర్ పోర్ట్‌లో అందిన వీసాలతో (నలుగురివి), ఏరోఫ్లోట్ ఎక్కారు ప్రభావతి. కరాచీ మీదగా తాష్కెండ్ (ఉజ్ బెకిస్తాన్ రాజధానీ నగరం - జనాభా 20 లక్షలు - ఉజెబెకిస్తాన్ అనగా I am my own master అని అర్థం) రాత్రి తొమ్మిదింముప్పావుకి చేరుకుంది - స్థానిక టైము ఏడుంపావు.

అంతస్తుకి వంద గదులున్న పదహారు అంతస్తుల హొటల్‌లోని 14 వ అంతస్తులో వాసా ప్రభావతికి సింగిల్ రూమ్ యిచ్చారు. రాత్రి పదిగంటలకు వెజిటేరియన్ భోజనాలు,

ఇన్నేళ్లుగా అలవాటైన కాఫీ మర్నాడు పుదయం లేకపోవటం, బ్రేక్‌ఫాస్ట్, మ్యూజియమ్ చూడటం, మెట్రోలో వెళ్లడం, లాల్‌బహదూర్ శాస్త్రి విగ్రహం, దుర్గాప్రసాద్ దంపతులూ, ఒంగోలుకు చెందిన భాస్కర్రావు, సుబ్బయ్య, సుబ్బారావు, పున్నయ్య, ఇంజనీరింగ్ చదువుతున్న విజయకుమార్, గన్నవరం నుంచి వచ్చి యిక్కడ మెడిసిన్ చదువుతున్న విద్యార్థినులు యామిని, గౌరి (90 మంది ఇండియన్ స్టూడెంట్స్ వున్నారు తాష్కెండ్‌లో) ... ఇలా మూడు రోజులయాక 'నదుల ఒడిలో వికసించిన పద్మం' లాటి లెనిన్‌గ్రాడ్‌కి వెళ్లారు ఈ బృందం.

సెయింట్ పీటర్స్ బర్గ్, పెట్రోగ్రాడై, ఆ తర్వాత లెనిన్‌గ్రాడ్ అయింది. ఒకనాటి జార్ చక్రవర్తుల రాజధానీ నగరమిది. తిరుగుబాటు చేసిన నావికులు వింటర్ పాలెస్‌ని పట్టుకోవడం, బెర్లిన్‌లో తలదాచుకున్న లెనిన్‌ని జర్మనులు సీల్డ్ ట్రయిన్‌లో యిక్కడికి పంపటం, రహస్యంగా పెట్రొగ్రాడ్ చేరుకు విప్లవ శక్తులని క్రమబద్ధంగా నడిపించి, అక్టోబరు మహా విప్లవానికి మూలపురుషుడవటం, (అప్పటికింకా రష్యనులు పాత కాలెండరే అనుసరిస్తూ వుండటం వల్ల నేటి నవంబరు ఏడు అక్టోబరులో వచ్చింది).... అదంతా గడిచిన చరిత్ర. 42 నదులతో 500 వంతెనలు గల పట్నం లెనిన్‌గ్రాడ్. 1918లో రాజధాని మాస్కో నగరానికి మారినప్పటికీ, నౌకా బల సంపద, నౌకా వ్యాపారమూ వల్ల లెనిన్‌గ్రాడ్‌ది చాలా ప్రముఖ స్థానం.... 'అప్పుడప్పుడు కనిపిస్తున్నాడు సూర్యుడు - ఎర్ర జండా నిగ నిగలతో తన వేడిమి కొలుచుకోమని' - అంటూ కవిత అల్లారు ప్రభావతి .. లెనిన్‌గ్రాడ్ యూనివర్సిటీలో 15 భాషలు నేర్పుతారు - ఇరవైవేల మంది విద్యార్థినీ విద్యార్థులు వున్నారు.

అక్కడ నుంచి వీరు ట్రయిన్‌లో మాస్కో వెళ్లారు. లెనిన్ ముసోలియమ్, రెడ్‌స్క్వేర్. నవంబరు ఏడో తేదీ ఉత్సవాలలో పాల్గొనడం - యివన్నీ మామూలే! నిడమర్తి ఉమా రాజేశ్వరరావు దంపతులని (ప్రగతీ ప్రచురణాలయం) బండారు శ్రీనివాసరావు దంపతులని (మాస్కో రేడియో) కలుసుకున్నారు - వారింట్లో గోంగూర పచ్చడితో భోం చేశారు.

మాస్కో ఉత్సవానంతరం కేవ్ (యుక్రేన్ రాజధాని) - రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో శతృతాకిడిని విజయవంతంగా ఎదుర్కొన్న నగరమిది. అక్కడి వార్ మెమోరియల్ చరిత్రాత్మకమైనది. తిరిగీ తాష్కెండ్ చేరుకు, రషీమా, మేరీలకు (గైడ్స్) వీడ్కోలు చెప్పి విమానం ఎక్కింది ఈ బృందం.

'స్నేహయాత్ర'ని వాసా ప్రభావతి చక్కటి ట్రావెలోగ్‌లా రాశారు. 'రోడ్లు తుడిచేవాడు - రాకెట్లు నడిపేవాడు - నివశిస్తున్నాడు ఏక అంతస్తులో' - అన్నారు, కవయిత్రిగా. నిజమే

– చీపురుకట్టకి, వాక్యుమ్‌క్లీనర్‌కి గల తేడా విస్మరించలేము. ఈనాడు అమెరికా, సోవియట్ యూనియన్‌లు రెండూ – సంపద విషయంలో ఒకే స్థాయిలో వున్నాయి.... 'అసంతృప్తి సర్వత్రా ఉంటుంది – ఆశాజీవే అభ్యుదయవాది' అనే ముగింపు బావుంది.

—క్షీరసాగరమ్

బ్రౌను – తెలుగు కావ్య సముద్ధరణము. రచన: డా. ఆర్. పద్మావతి; ప్రచురణ: నవ్య పరిశోధక ప్రచురణలు – తిరుపతి; వెల: రు. 50-00; ప్రతులకు: జి. లక్ష్మమ్మ, 18-1-699 భవానీ నగర్, తిరుపతి.

మద్రాసు విశ్వవిద్యాలయం వారు డాక్టరేటు యిచ్చిన సిద్ధాంత గ్రంథం యిది. విషయం బ్రౌనుకు సంబంధించినదవటం చేత ఆధునిక తెలుగు సాహిత్య వుషోదయానికి పూర్వరంగం ఎట్లా వుండేదో తెలుసుకో గోరిన వారికి ఆసక్తికరంగా వుంటుంది.

పరిశోధనాసక్తి వున్న వారికే గాక సామాన్య పాఠకులను కూడా ఆశ్చర్య పరిచే వాస్తవాలు కొన్ని అక్కడక్కడా యీ గ్రంథంలో కనబడతాయి.

1829 వ సంవత్సరంలో బ్రౌను ముద్రించిన వేమన పద్యములే తెలుగున ముద్రితమైన తొలి పద్య కావ్యము.

"ఒక రూపాయకు 200 పద్యముల చొప్పున యిందలి (విష్ణు పురాణము) 3217 పద్యములను 32 రూ॥ 8 అణాలకు వ్రాయించెను. ఈ ప్రతిని వ్రాయించుటకు కావలసిన కాగితముల వెల, బైండింగు ఖర్చులు, సవరించిన పండితుల జీతములు మున్నగునవి భరించుటయే కాక బ్రౌను స్వయముగ పాటుపడవలసి వచ్చెను."

బ్రౌను అవివాహితుడుగా తన జీవితకాలమంతా గడిపి, తన భాషా దన, కాలము అంతా తెలుగు సంపా పునరుద్ధరణకి వినియోగించాడు.

'పరవస్తు చిన్నయసూరి తన యొద్ద వుద్యోగము చేసినట్లును, అతడు దశావతార చరిత్రను పరిష్కరించినట్లును బ్రౌను స్వహస్త లిఖిత లేఖనము లభించుచున్నది.'

ఇటువంటి ఎన్నో వివరాలతో శాస్త్రబద్ధమైన పరిశీలనతో, వున్న పరిమితులలో సి. పి. బ్రౌనుని ఒక వ్యక్తిగా కూడా పరిచయం చేస్తూ చదివింప చేస్తారు రచయిత్రి.

ఏనుగుల వీరాస్వామి, బ్రౌనుకు పండిత మిత్రుడు. వారి మధ్య వుత్తర ప్రత్యుత్తరాలు నడుస్తూ వుండేవట.

బ్రౌను వ్యవహరించిన తెలుగు భాష అతని లేఖల్లో స్పష్టమవుతుంది. ఆరోజుల్లో వాడుక భాష యిట్లా వుండేదన్న మాట.

"మరిన్ని వ్రాయవలసినది మేమంటే కవి గౌరవమంత్రి చెప్పినటువంటి నవనాథ చరిత్ర అనే అంధ్ర ద్విపద కావ్యము అయిదు ఆశ్వాసములు కలది.... మాకు ప్రస్తుతం జరూరుగా కావలసినవి .... గనుక యిప్పుడు

దొరికే గ్రంథం సారంగధర చరిత్ర అన్న పక్షమందు కవి నామం చూడ వలసినది. గౌరవ అనే అహ్వాయం వుంటే నాకు కావలసినటు వంటి గ్రంథం యిదేను అని గ్రహించ వలసినది. "

పద్మావతిగారి రచన మొదట్లో నాలుగైదు పుటలు క్లిష్టంగా సాగినా ఆపైనా సరళ గ్రాంధికంలో సజావుగా నడిచింది. వారి కృషి ప్రశంసనీయం.

—సరోజినీ ప్రేమచంద్

## ఈ మధ్య అందినవి :

మానవుడి పాట్లు -, మిహయీల్ షోలోహవ్. అనువాదం : శ్రీ శ్రీ (The Fate of a Man) తృతీయ ముద్రణ రు 3-00.... పిల్లల మన స్తత్వ శాస్త్రం - ధూర్జటి సుబ్బారావు. ఆరవ ముద్రణ రు. 12 - 00 .... గురజాడ రచనలు - బిల్హణీయం, కొండు భట్టీయం. సంపాదకుడు: సెట్టి ఈశ్వరరావు. రు. 12 - 00 .... కుటుంబరావు సాహిత్యం - రెండవ సంపుటం. సంపాదకుడు : కేతు విశ్వ నాథరెడ్డి - రు. 40-00.... పెరిస్త్రోయికా - గోర్బచేవ్. అనువాదం : యస్ రామ్మోహన్, పి యోగయ్య, యమ్ సుబ్బారావు. యమ్ సారధి. రు. 30 - 00. పై పుస్తకాలన్నీ ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్, 4 - 1 - 435 బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001 .... విశాలాంధ్ర బుక్‌హౌస్ బ్రాంచీలు : విజయవాడ, హైదరాబాదు, విశాఖపట్నం, తిరుపతి, అనంతపూర్, గుంటూరు, హనుమకొండ, కాకినాడ.

అండమాన్ కలాలు - కవితా సంకలనం. యస్ వి ప్రసాద్ ... తెలుగు సాహితీ సమితి పోర్ట్‌బ్లెయిర్ - 744 102. రు. 5-00.

శ్రీమద్భాగవత రహస్య మహాత్మ్యాలు. పురాణపండ రాధాకృష్ణ మూర్తి, రాజమండ్రి - 4.... రు. 5 - 00.

విశ్వవిభూతి - శతకం. ఆచార్య తిరుమల, చైతన్య కళాశాల, హైదరాబాదు - 1 .... రు. 3 - 00....

అందుకున్న పుస్తకాలన్నీ గాక పోయినా కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడతాయి.

కొన్ని పరిస్థితులు నుంచి ఉద్భవ మందుతుంది కథ. ఆ ప్రాథమిక పరిస్థితులకు హేతువుతో నిమిత్తం లేదు. కాని, ఉద్భవ మందిన మరుక్షణం నుంచీ కార్యకారణ బంధానికి కట్టుబడి నడవాలి ప్రతిఘటమూ.

*　　*　　*

**రచయిత మనసులో వుండి, కలం లో నుంచి కాగితం మీదకు రానంత వరకే అది అతని స్వంత ఆస్తి : ఒక్క సారి కాగితం మీద రూపుదాల్చ డంతో, యిక ఆ పాత్ర రచయితకు చెందదు. యిక్తా యుక్తాలు నిర్ణ యించేది పాఠకులవుతారు.**

—సోమర్సెట్ మామ్

1776 జులై - ఆ నాలుగు రోజులు

# స్వాతంత్ర్య పత్రం

గడిచిన కథ : అమెరికాలోని పదమూడు వలసలలోని ప్రజలు ఏక తాటి మీద నడిచేందుకు ఉద్యుక్తు లవుతున్నారు. జఫర్సన్ లిఖించిన స్వాతంత్ర్య పత్రంపై ప్రజాప్రతినిధుల వాదోపవాదాలు జరుగుతున్నాయి. నిర్ణయం తీసుకొనే వరకే తప్ప ఆ తర్వాత అందరిదీ ఒకే మాట. ఆంగ్ల ప్రభువు మూడవ జార్జి ఈ తిరుగుబాటుని అణచి వేయాలనే పట్టుదలతో ఉన్నాడు .... ఇక చదవండి

"ఒక జాతిని అణిచి వేయడము మీ వలనయే పనా? మీరు అమెరికాని జయించగలరా? నేనే అమెరికన్‌గా జన్మించి వుంటే, ఒక్క విదేశీ సైనికుని నాదేశముపై అడుగుపెట్టనిస్తానా? నా సేనలనూ, నా ప్రజలనూ ప్రాణాలొడ్డి కాపాడనూ? అమెరికానూ మీరు జయించడముకల్ల - అది జరగని పని, ఎటొచ్చి ప్రపంచ దృష్టిలో మీకు న్యూనత" అన్నాడు పిట్.

పార్లమెంటులో మార్మోగిన ఈ భవిష్యద్వాణికి విలువలేక పోయింది. బొస్టన్ నగరము నుంచి బ్రిటీష్ సేనలని ఉపసహరించుకోవాలనే చాతమ్ ప్రభువు తీర్మానాన్ని రెండు సభల వారూ త్రోసిపుచ్చారు. పార్లమెంటులో ప్రాతినిధ్యముకోసమై చిరకాలంగా వలసలు సాగిస్తున్న ఆందోళనని కనీసం పరిశీలించేందుకుకూడా నిరాకరించారు. బర్క్ ప్రవేశపెట్టిన సామరస్య తీర్మానాన్ని కూడా త్రోసి పుచ్చారు. రాజభక్తుడైన డికెన్సన్ విన్నపము విస్మరింపబడినది. నార్త్ ప్రభువు ఒక రాజీ పథకాన్ని సూచి చాడు వలసలు తమ పన్నులని తామే నిర్ణయించుకొనే స్వపరిపాలనా కాశాలను కొంత దాకా కలిగిద్దామన్నాడు. నార్త్ ప్రభువు మిత్రులే ఈ పంథా దేశద్రోహకరమన్నారు. మసి పూసి మారేడుకాయ చేసేందుకు బ్రిటిష్ ప్రధాన మంత్రి కడపటి ప్రయత్నం చేస్తున్నాడని వలసలు భావించాయి. అమెరికాలో తుపాను చెలరేగుతోంది. బ్రిటిష్ ప్రధానికి కారుమేఘాలే తప్ప మరేమి కనపడటం లేదు.

ఉదయము పది గంటలవేళ నార్త్ ప్రభువు విండ్సర్ భవనంలోని మూడవ జార్జి సమక్షంలోకి ప్రవేశపెట్టబట్టాడు. రాజుగారు తన ప్రధాన మంత్రిని పరికించి చూశాడు. ఈ ప్రధాని తన మానసికాందోళనని దాచుకో లేకుండా వున్నాడని, నిశితదృష్టిగల రాజు గ్రహించాడు : ఈ విశ్వాసనీయుడు తన

యాజమానిని నట్టనడి సముద్రంలో వదిలివేయ వచ్చునని, అతని రాజీ నామా పత్రాన్ని వుద్దేశిస్తూ రాజుగారు అన్నాడు : 'ఇటువంటి క్లిష్టసమయం లో నీవంటి ఉత్తముని ఎలా పోగొట్టుకోగలను ? రాజీనామా ఎలా ఆమోదించగలను ?'

"పరిస్థితులు కష్టసంజనితము లైనప్పుడు, నేను తమ ఆజ్ఞ ప్రకారము నడుచుకొన్నాను. కాని యిప్పుడు అవి తారుమారయాయి. కార్యకారణాలు కూడా తలకిందులయాయి. మీరు నా రాజీనామా పత్రాన్ని అంగీకరించ డానికి ఎంత ఉపేక్ష చేస్తే, పరిస్థితులు అంత క్లిష్టతరము లవుతాయి."

"ఆ బాగోగులు నేను చూసుకో గలనుగా."

"నూతన సమస్యలు మంత్రి వర్గాన్ని నిలబెట్టి ప్రశ్నిస్తున్నాయి. వాటిని పరిష్కరించగల సమర్థుణ్ణి కాను. నేను వలసల సమస్యలేగాక దేశరక్షణ సమస్యలను కూడా ఆలో చించవలసి వున్నది, నామాట నమ్మండి - మీకు ఈ అదనులో గుండె నిబ్బ రంగల అనుభవశాలి కావాలి. నా వంటి వానివల్ల ఈ కార్యభారం సక్రమంగా నెరవేరదు" అని ఎంతో వినయంగా చెప్పుకున్నాడు.

"ఛాతమ్ ప్రభువు వంటి వానిని ప్రధానిగా తీసుకోమని నీవుద్దేశ్యమా ?"

"ఛాతమ్ ప్రభువు కడు సమర్థుడు. ఎంతటి కఠిన సమస్యనైనా అవలీలగా పరిష్కరించగలడు."

"మిత్రమా నా మనసులో గల మాట నీకు చెప్పనా ? ఎంతటి ఉప ద్రవము ఏర్పడినప్పటికీ ఛాతమ్ ప్రభువువద్ద నుంచి గాని, ప్రత్యర్థి వర్గం నుంచిగాని కంఠంలో ఊపిరివుండగా సహాయాన్ని కోరను."

మూడవ జార్జి ప్రధాను లందరి లోనూ ఛాతమ్ ప్రభువు అతి ప్రతిభా వంతుడు. ఆయన మంత్రిత్వ దశలోనే గ్రేట్ బ్రిటన్ ప్రపంచ దేశాలలో అగ్ర స్థానం అందుకొంది. ఛాతమ్ ప్రభువు అఖండ గౌరవం పొందుతున్న రోజు లలో మూడవ జార్జి అసూయాగ్రస్తుడై అతనిచేత రాజీనామా నిప్పించాడు. తన ప్రధాన మంత్రి తనకంటె గొప్ప వానిగా శ్లాఘింపబడటం భరించలేక పోయాడు.

"స్వదేశంలో అంత:కలహాన్ని నివారించగల నేమోనని ఆశపడ్డాను" అన్నాడు లార్డ్ నార్త్ నిరాశాహృదితో.

మూడవ జార్జి తన ప్రధాని వంక చురుకుగా చూసి అన్నాడు : "మనము ఘనంగా భావించే ఆశయాలకిది పరీ క్షాసమయం, పార్లమెంటు హక్కులూ సింహాసనాధికారపు హక్కులూ మనము నిరూపించుకోవాలి."

రాజుగారి ముఖం ఎర్రబడింది. కండ్లు పెద్దవయాయి. ఆగ్రహావేశ చిహ్నాలు ముఖములో కనబడు తున్నాయి. కాని మంకుపట్టుతో తనదే రుజుమార్గమను మూర్ఖంలో కఠిన వాక్కులు పలుకుతున్నాడు. "ఈ రాజ ద్రోహ చర్యలని ఇప్పట్లో సహిస్తే యివి చిగురించి మొక్కలై మానులు

కావా ? వీటి పర్యవసాన మేమిటి ? వెస్టిండియా దీవులలో, ఇగ్లెండులో, ఇండియాలో గల ప్రజలు వీరిని అను సరించరా ? యూరప్ నంతా అల్లకల్లో లంలో ముంచి మన సామ్రాజ్యాన్ని ఛిన్నాభిన్నం చేయగల ఈ విప్లవ మొలకకు నీరుపోసి పెంచడమా? దీనిని మొదట్లోనే తుంచెయ్యాలి.'' తన సింహా సనం తప్ప హేతువాదాన్ని మరచిన మూడవ జార్జి తన విపరీత బుద్ధికి తోచిన సాకులు వెతుకుతున్నాడు.

నార్త్ ప్రభువు వినమ్రంగా నమస్క రించి, నెమ్మదిగా తలుపు తెరుచుకు వెళ్ళాడు. శూన్యమందిరంలోని మూడవ జార్జి తనకుర్చీలో విగ్రహము మాదిరి కూర్చుని తనలో చెలరేగిన భావపరం పరను పరిశీలించు కుంటున్నాడు. గుప్పెట్లు మూస్తున్నాడు. తెరుస్తు న్నాడు ఏదో గొణుక్కుంటున్నాడు. ఈ నల్లతెరజారకుండా అతను ఆప లేడు. బాష్పాలతో నిండిన ఆ నేత్రాలు భార్యా పిల్లల్ని కూడా గుర్తించ లేక పోతాయి.

ఫిలడల్‌పియాలో జులై ఒకటో తేదీ సోమవారము మధ్యాహ్నం సమా వేశము వాయిదా పడిన తరువాత ప్రతి నిధులందరూ వారి వారి స్థావరాలకు జారుకున్నారు. జాన్ యాడమ్స్ మాత్రము యీ తీర్మానము ఎందుకు వాయిదా పడిందా అని మందిరంలో కూచునే ఆలోచిస్తున్నాడు. రట్లెజ్‌కి (దక్షిణకెరోలినా) ఛార్లెస్టన్ నుంచి ఏదైనా కబురు వచ్చిందేమో! మేరీ లాండ్ సుముఖంగా ఉంది. దక్షిణ

కెరోలినా యిటూ అటూ అని వూగిస లాడేటంతవరకూ వచ్చింది. మిగిలినది పెన్సిల్‌వేనియా డెలవార్‌లు. అన్ని వలసలూ ఏకతాటిమీద నడిస్తే సగము యుద్ధము నెగ్గినట్లే, ఆఖరి ఒక్క రాష్ట్రము చీలిపోయినా ఆ వొక్కటీ శత్రువుకాలూతకు స్థానముగా ఏర్పడి, దేశాన్ని అంతఃకలహంలో ముంచు తుంది. పెన్సిల్‌వేనియాని తాము ఆకట్టుకోగలగడము కొంచెము సంశయాస్పదముగా వున్నది. ఇక డెలవార్ విషయము ఆనాడు హాజరుగాని సీజర్ రోడ్నెపై ఆధారపడివున్నది.

మరునాడు తిరిగీ సమావేశము ప్రారంభమయే లోపున తెరవెనుక జరగవలసిన తతంగం చాలా వున్నది. ప్రతినిధులను నెమ్మదిగా తమవైపు తిప్పుకోవాలి. స్వాతంత్ర్యం కోసమై పర్వతాలని కదపాలి. డెలవార్‌కి చెందిన మాక్కీన్ అప్పుడే వెలుపలికి వెళ్తున్నాడు. యాడమ్స్ అతనిని పిలిచాడు ఇరువురూ జార్జిరీడ్ విషయం ఏకాభిప్రాయానికి ఎప్పుడో వచ్చారు. అతను స్వాతంత్ర్య తీర్మానానికి బద్ధ విరోధి, కాని సీజర్ రోడ్నీ అంత మొండిఘటం కాదు, డెలవార్‌పై న్యసమీకరణలో ఎంతో సహాయపడుతున్న రోడ్నె ఎందువల్ల ఈ సమావేశానికి రాలేదో మాక్కీన్‌వద్ద నుంచి తెలుసుకోవచ్చు ననుకున్నాడు జాన్ యాడమ్స్. "నేను అతని కోసం ఒక గుర్రపురౌతుని పంపించాను".... "మంచిపని చేశారు. కాని ఆ రౌతు ఎక్కడా బురదలో కూరుకు పోకుండా వుండుగాక - అని ఆశిద్దాం" అన్నాడు జాన్ యాడమ్స్. డోవర్‌కి వెళ్ళడమంటే 150 మైళ్లు. రహదారులు సరిగాలేని చిత్తడినేలగుండా ప్రయాణం చేయడము.

"ససెక్స్‌కౌంటీలో అలజడి చెలరేగింది. అక్కడ మన మిత్రులుసైనిక పటాలాలని సమకూరు స్తున్నారు. ఆరునూరైనా రోడ్నీవచ్చి తీరుతాడు. మీరు అదుర్దాపడవద్దు" అన్నాడు మాక్కీన్.

యాడమ్స్ శిరసు పంకించాడు. హాలు మధ్యనుంచి నడిచివెళ్తున్న రట్లెజ్, మాక్కీన్‌తో మాట్లాడను న్నట్లుగా ఆగాడు. తెరిచివున్న సింహద్వారము నుంచి వెలుపలికి చూస్తున్నాడు యాడమ్స్. కొందరు ప్రతినిధులు అప్పుడే వెళ్ళిపోయారు. మారిస్ కోసమని గుమ్మంవద్దకు వచ్చాడు యాడమ్స్.

యాడమ్స్ వెలుపలికి అడుగు పెట్టాడోలేదో మాక్కీన్ అతనివెనకనే వచ్చి తెలిపాడు: "రట్లెజ్ యిప్పుడే చెప్పాడు నాకు - రేపు దక్షిణ కరోలినా స్వాతంత్ర్య తీర్మానాన్ని బలపరుస్తూ వోటు చేస్తుందట"... "చాలా సంతోషమైన విషయం." అన్నాడు యాడమ్స్ కడు ఆనందంతో. "ఛార్లెస్టన్ పరిస్థితి ఈ నిర్ణయానికి కారణమేమో" మాక్కీన్ కావచ్చునన్నట్లు తలవూపి తన దారిని తాను గబగబా వెళ్ళిపోయాడు. పోయిన వేసవినాటి సంగతి యాడమ్స్‌కి గుర్తు కొచ్చింది. కాంగ్రెస్ సభలోని మితవాదులు కొత్త మహజరు పంపాలని పట్టుబడు

తున్నారు. జులై ఆరవ తేదీన డికెన్సన్ తయారుచేసిన వినమ్రవినతి పత్రము వోటింగ్‌కి పెట్టబడింది. ఇది నిరుపయోగమూ అగౌరవకరమూ అంటూ ఆ వినతి పత్రానికి వ్యతిరేకంగా మాట్లాడాడు యాడమ్స్. కాని అధిక సంఖ్యాకులు దానిని ఆమోదించడమువలన, వినతి పత్రాన్ని మూడవ జార్జి సముఖానికి పంపారు. తత్సందర్భములో తన బాస్టన్ మిత్రునికి యాడమ్స్ యిలా రాశాడు :

"జాన్‌డికెన్సన్ భాగ్యవంతుడూ తెలివిగలవాడూ గాని బుద్ధి వికటించింది. తన కీర్తి ప్రతాపాలను శ్లాఘించుకునే ఈ వ్యక్తి మా సత్ప్రయత్నాలను పెడదోవ పట్టిస్తున్నాడు. ఒక నెల్లాళ్ళ క్రితమే పరిపాలనా యంత్రము మనచేతికి అందివుండేది. ఈ సరికి రాజ్యాంగ నిర్వహణ రూపొంది, మన రేవు పట్నాలు వ్యాపార కేంద్రాలుగా మారివుండేవి. అంగ్లరాజు ఉద్యోగులు ఈపాటికి మనకి ఖైదీలుగా చిక్కి వుండేవారు. శత్రువంశమైన అమెరికనులను విడిపించేందుకు ఈ రాజోద్యోగులను బందీలుగా వుంచి బేరాలు పెట్టేవాళ్ళం. వంచనా శిల్పంలో అరితేరిన డికెన్సన్ ఏఒక్క పనీ పడనీయక, తన వక్రబుద్ధితో.... "

యాడమ్స్ రాసిన ఈ అనాలోచిత లేఖ బ్రిటిష్ వారి చేజిక్కింది. అరువారాల అనంతరము లండన్ వార్తా పత్రికల్లో అది ప్రచురింపబడింది. మూడవ జార్జికి వినతి పత్రము అందడము, ఈ లేఖ ప్రచురింపబడటం ఒకేసారి జరగడంతో అమెరికనుల మనస్తత్వమూ, కార్యక్రమావళీ బోధపడినట్లయి, అంగ్లపాలకులు మరింత మొండికెత్తి, తిరుగుబాటుచేస్తున్న వలసలను కఠినంగా అణిచి వేయాలన్నారు. ప్రభుత్వ భవనములో యాడమ్స్‌తో మాట్లాడడానికి నిరాకరించాడు డికెన్సన్, మితవాదులు యాడమ్స్‌ని అంటరాని వానిగా చూడసాగారు.

చెట్లవీధి వైపుగా నడుస్తున్నాడు యాడమ్స్. సాయంత్రపుగాలి కొంచెం తేమతో చల్లగా వున్నది. తుపాను అనంతరం ఏర్పడే ప్రశాంతత వలెనున్నది వాతావరణం ఎన్ని అసందిగ్ధాలు ఆదుర్దాలు వున్నప్పటికీ క్షితిజరేఖపై ఏదో ఆశాదీపం కనపడుతోంది. యాడమ్స్ తొందరగా భోజనము ముగించుకొని, యుద్ధకమిటి సభ్యులని కలుసుకోవాలి. ఆ తరువాత నౌకా శాఖకి చెందిన కమిటీని కలుసుకు ఆ విషయాలు పరిశీలించాలి.

ఫెయిర్ హిల్‌లోని విశాలభవనములో జాన్ డికెన్సన్, డిన్నర్ టేబుల్ ముందు కూచున్నాడు ; తమ జీవనక్రమతని మార్చి వేసే నిర్ణయము తీసుకోకతప్పదు. మనసు పరిపరివిధాల పరిగెడుతూ వుంది. కాని భార్యకూ తల్లికీ తన అందోళన తెలియనీయడము లేదు. (ఇంకాఉంది)

**మాతృక : కార్నెల్ లెన్‌గ్యేల్**
**తెలుగు : యన్నార్ చందూర్**



"It is said that Bharata abhorred Ayodhya without Rama and as such he never stepped into the town and stayed away at Nandigram, placing the footwear of his brother on the throne and carried on the administration of the state for fourteen long years. Am I correct, Father ?"

"Yes, you are perfectly correct," said Raghu's Father.

"How could such a devoted man try to commit suicide when Rama didn't turn up by the appointed hour. Even though we live in Space Age, our surface transport cannot keep up time and why should Bharata be in such a hurry for suicide ?" questioned Raghu.

"Suicide is not the word - immolation. It involves a spirit of sacrifice while suicide is committed in an emotional upheaval. Bharata wanted to immolate himself in fire. To his disturbed brother, Rama gave the exact time of his return fourteen years earlier. True he was slightly delayed on way and he was aware of the repercussions. So, he asked Hanuman to jump in advance and inform Bharata of the good news. Ramadoota Hanuman, the first musician, started singing from a distance in praise of Rama and his victorious return with all glory. That melodious tune fell on Bharata's ears and with tears rolling down the cheeks he rushed with open arms to receive Rama," explained Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive' Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*

సమీక్షలు

# చిత్రజగతి

## యన్ఫెడిసీ సమర్పణ 'చివరి సమ్రాట్'

(The Last Emperor - NFDC)

తల్లి వొళ్లో ఉన్న మూడేళ్ల బాలుని, దైవజ్ఞుల నిర్ణయప్రకారం, రాజాంతఃపురానికి (ఫర్‌బిడెన్‌సిటీ - Forbidden City) పట్టుకొచ్చి, ఛింగ్ వంశం లోని చివరి మహారాణి ఆశీర్వాదంతో, ఆ పసివాణ్ణి సింహాసనంపై కూచోపెడతారు రాజతంత్రజ్ఞులు. దైవసుతుడు, పదివేల సంవత్సరాలు పాలించే ప్రభువు - అని కీర్తిస్తారు. 1908లో పెకింగ్‌లో యిది జరుగుతుంది. 1912 లో చైనాదేశం సన్-యట్-సెన్ నాయకత్వంలో రిపబ్లిక్ అవుతుంది. అయితే, ఈ ఫర్‌బిడెన్ సిటీలో వున్న ఏడెనిమిదేళ్ల వయసు గల ఈ చక్రవర్తికి బయట ప్రపంచం గురించి తెలీదు; - బయట ఏం జరుగుతున్నదో తెలియదు; చుట్టూ వున్న అందరూ తనని దేవుడంటారు. రాజబంధువులు, రాజసేవకులు, పరివారం, పదిహేను వందల మంది కొజ్జాలు, రాజమర్యాదలు, రాజలాంఛనాలు - యివే తప్ప లోకం ఎలా ఉంటుందో కించిత్తు కూడా తెలియదు. అదృష్టవశాత్తూ ఈ సమ్రాట్‌కి (ఆ బాలుని పేరు 'పు - ఇ') ఒక ట్యూటర్ని ఏర్పరుస్తారు. అతని ప్రోత్సాహంతో 'హిజ్ మెజస్టీ' సైకిలు తొక్కడం నేర్చుకోగా, ముఖ్యమంత్రి ముక్కుమీద వేలేసుకుంటాడు. 18వ ఏట 'పు - ఇ' యిద్దరు రాకుమార్తెలని పరిణయమాడి యిద్దరినీ చెరోవైపునా ఏకశయ్య మీద పడుకోబెట్టుకుంటాడు. జడ కత్తిరించుకు క్రాప్ చేయించుకోవడం, గౌను వొదిలేసి పాంటూషర్టూ వేసుకోవడం, ఆంగ్లభాష ద్వారా బయట లోకం తెలుసుకోవడం, టెన్నిస్ ఆడటం - యిలాటివన్నీ నేర్చుకుంటాడు. రిపబ్లికన్ ప్రభుత్వం, చిరకాల సంప్రదాయం మీద వుండే గౌరవం కొద్దీ ప్రజాజీవితాన్ని ఏ విధంగానూ స్పృశించలేని రాజాంతఃపురం జోలికి రాదు. - వారి వింత లోకంలో వారిని ఉండనిస్తుంది. అయితే, పెకింగ్ నగరం ఒక 'వార్ లార్డ్' హస్తగతమవడంతో, అంతఃపుర సంపద కూడా దోచుకోవాలనిపిస్తుందతనికి. జాన్‌స్టన్ సలహా మీద 'పు - ఇ' తన యిరువురు

భార్యలతోను, 'టిన్‌స్టిన్'లో ఆశ్రయం పొంది, ఏడేళ్ల పాటు నిశ్చింతగా విలాసమయ జీవితం గడుపుతాడు. 1931లో జపాన్, మంచూరియాపై దాడిచేసి, ఆ ఆక్రమిత ప్రాంతాలకు 'పు - ఇ' ని చక్రవర్తిని చేస్తుంది. అది రాజకీయపుటెత్తు అని గ్రహింపనేరని 'పు - ఇ', అప్పటికే ఛియాంగ్‌కెషేక్ చైనాలో ఏర్పరిచిన ప్రభుత్వాన్ని కాదని, జపాన్ విసిరిన వలలో యిరుక్కుంటాడు. రెండవ ప్రపంచ యుద్ధ కాలం నాటికే ఛియాంగ్‌కెషేక్, మావో లు బలాబలాలు చూసుకుంటున్నారు. 1949లో మావో, పీపుల్స్ చైనా ప్రభుత్వం స్థాపిస్తాడు. ఖైదీగా చిక్కిన చైనా చక్రవర్తిని, దోషిగా నిర్ణయించి, పదేళ్ల జైలు శిక్ష విధిస్తుంది ప్రజా ప్రభుత్వం. పదేళ్ల తర్వాత కారాగారం నుంచి విడుదలైన చైనా చక్రవర్తి ('పు - ఇ') ఒక బొటానికల్ గార్డెన్‌లో తోటమాలిగా చేరి, హాయిగా సైకిలు తొక్కుకుంటూ నిరభ్యంతరంగా బస్సు ఎక్కుతూ, తను ఒకప్పుడు కూచున్న సింహాసనం పర్యాటకుల మ్యూజియమ్ కాగా తను కూడా ఒకసారి అది చూసి, ఆ భవన రక్షకులలో ఒకడైన బాయ్‌స్కవుట్‌కి విస్మయం కలిగిస్తాడు. జడలతో నడిచిన మనుషులకీ, జయ ధ్వానాలు చేస్తూ నడిచే మనుషులకీ, ఇవ్వాళ నెత్తి నెక్కించుకు రేపు కిందకి తోసే మనుషులకీ, అట్టే తేడా కనిపించదు. కట్టలుతెగి ప్రవహించే నదుల్లాటి జన సమూహాల్లో మృగయా వినోదమే తప్ప మానవతా లక్షణం వుండదు. చివరి చైనా చక్రవర్తి 'పు - ఇ' 1967లో, తను విడుదలపొందిన-ఎనిమిదేళ్లకు మరణించాడు. 'ట్విలైట్' (TWILIGHT) అనే పేరుతో 'సర్ రెజినాల్డ్ జాన్‌స్టన్' (ట్యూటర్) పుస్తకం ఆధారంగా ఈ చిత్రం తీశారు. ఈ శతాబ్దంలో, మన పొరుగు దేశమైన చైనాలో, యదార్థంగా జరిగిన వాస్తవగాథ - ఆధునిక విషాద కావ్యం .. జాన్ లోన్, జీన్ ఛెన్, పీటర్ ఒ టూలె నటించిన ఈ చిత్రానికి దర్శకులు : బెర్నార్డో బెర్టొలుస్సి.... 'బెన్‌హర్' తర్వాత తొమ్మిది ఆస్కారులు పొందిన చిత్రమిది. బెస్ట్ పిక్చర్, బెస్ట్ డైరక్టర్, స్క్రీన్ ప్లే, ఆర్ట్ డైరక్షన్, కెమెరా, కాస్ట్యూమ్స్, ఎడిటింగ్, సౌండ్, మ్యూజిక్ - యిలా మొత్తం తొమ్మిది ఆస్కార్ అవార్డులు వచ్చాయి.... 'సింహాసనమనగా ఏముంది ముఖమల్ కుట్టిన కర్ర కుర్చీ' అని నెపోలియన్ నవ్వేసినప్పటికీ, ఆకుర్చీని పోలిన కుర్చీల కోసమే కదా అమాయకుల రక్తం కాలువలు కట్టేది ! కరుణార్ద్రతతో కూడిన కమనీయ కావ్యకుసుమం ఈ చిత్రం.... పి. ఆర్. ఒ : టి యమ్ రామన్.

## కోనేరు సమర్పిస్తున్న 'కింగ్ కాంగ్'

King Kong Lives

తుపాకీగుళ్లకు, యితర మారణాయుధాలకీ బెదరని కింగ్ కాంగ్‌ని ఎట్టకేలకు నేలకూల్చి పరిశోధనకోసం జార్జియా రాష్ట్రంలోని అట్లాంటిక్ ఇని

స్టిట్యూట్‌కి పట్టుకువస్తారు లేడీ డాక్టర్ యామి. కింగ్ కాంగ్‌కి ఒక కృత్రిమ గుండెకాయ తయారు చేసి, మళ్లీ ప్రాణం పోస్తుంది. అటవీపరిశోధనలో వున్న మిచెల్, ఒక ఆడకింగ్ కాంగ్ కళ్ల బడగా, దానిని నేర్పుగా పట్టుకొని, పదివేల డాలర్లకు ఈ ఇనిస్టిట్యూట్‌కి అమ్ముతాడు. ఆడ మొగ కింగ్ కాంగ్‌లు హాయిగా కలిసి వుందామనుకుంటాయి గాని స్వార్థమే ఊపిరిగా గల నరజాతి వాటిని బతకనివ్వదు. లేడీ డాక్టరూ, మిచెలూ యిద్దరూ కలిసి వాటిని బందిఖానా నుంచి తప్పించి, అడవులలోకి పోనిచ్చినా, పగబట్టిన కర్నల్ నెవిల్ తన సాయుధ బలంతో వాటిని వెంబడించి, నానా హింసలూ పెట్టి, ఆడ కింగ్ కాంగ్‌ని మళ్లీ బందీని చేయగా, మగ కింగ్ కాంగ్ విజృంభించి తన ప్రియురాలిని విడిపించి, కర్నల్‌ని నల్లిలా నలిపేసి, తన పుత్రుని సమక్షంలో కన్నుమూస్తుంది. తల్లీ కొడుకులు (కింగ్ కాంగ్‌లు) అడవుల్లోకి వెళ్లిపోతారు, .... భయానక కరుణ రసాలతో బాటు ఒక నీతి సూత్రం ఇందులో ఉంది. సమస్తసృష్టికి తనే ప్రభువననే దురహంకారం నరునికి





ఎవరెవరు ? ఏ చిత్రంలోనిది ఆ వేషధారణ ? సరిగా చెప్పగలిగిన మొదటి ఇరువురికి పదేసి రూపాయి బహూకరించగలము. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు చీట్లువేసి మొదటి ఇరువురికే బహుమతి యివ్వడం జరుగుతుంది. మీ జవాబు కార్డు మీదనే వ్రాయండి. మాకు అందవలసిన చివరి తేది : 5-1-1989.

JAGATI - 2, Kutchery Road, P B 2922, Madras - 600 004



తగదు. తనేమీ సృష్టించలేడు సంహ రించగలడే తప్ప! ఈ మహాసృష్టి ముందు వినమ్రుడై నడవటం నేర్చు కోవాలి - అన్నిటినీ మించినది దయా గుణం. ఇదంతా మాటలలో చెప్పరు. యామీ, మిచెల్ పాత్రలు అందుకు తార్కాణంగా నిలుస్తాయి. దర్శ కత్వం: జాన్ గల్లర్మిన్ .... పిఆర్ఒ: టియమ్ రామస్.

## కళ్యాణీ కంబైన్స్ 'ధర్మతేజ'

మహాభారతంలోని కర్ణునికి తన తల్లీ తండ్రీ ఎవరో తెలుసుకాని, ఈ 'ధర్మతేజ' కు వారెవరో కూడా తెలీదు. ఒక కాటికాపరి పెంచగా బాల్యం గడిపి, అతను మట్టిలో కలిసి పోయాక ఒంటరి వాడై, స్వశక్తితో పెరిగి పెద్దవాడై మాటకి కట్టుబడి వుండే నీతి నియమాలతో, చేస్తున్నది కల్లూ సారాయి వ్యాపారమైనా, అక్ర మార్జనకు తలవొగ్గని ధీరుడవుతాడు - తన సంపాదన పేదలకు పంచి, లేని వారి ఆకలిని తనకు చేతనైనంత మేర తీరుస్తాడు. అంతేగాక అతి బలశాలి; ఈ ధర్మతేజకు (కృష్ణంరాజు) అన్ని విధాలా అనుకూలమైన అర్ధాంగి సంపూర్ణ (రాధిక). ప్రాణభీతితో వీరి ఆశ్రయం కోరివస్తుంది ఒక ప్రేమ జంట - విద్య, ఆనంద్ (వాణి - ఆనంద్). ఒకప్పుడు ధర్మతేజ పార్ట నర్ అయిన రామ్‌కుమార్ (రంగనాధ్) చెల్లెలు ఈ విద్య ; ఇక ఆనంద్ బీద వాడైన బుద్ధిమంతుడు. అయినవాడూ అమ్మతమ్ముడూ యమ్మెల్యే శరభయ్య (కోట శ్రీనివాసరావు) కుతంత్రంతో, రామ్‌కుమార్ రెచ్చిపోతాడు .... నమ్మ శక్యంగాని ఫైట్సు, భారీ సెట్టింగుల స్వప్నవిహారాలున్నప్పటికీ, పెళ్లి పెద్ద డ్రస్‌లు ధర్మతేజ విలన్ యింటికి వచ్చేదాకా, స్క్రీన్‌ప్లే నవ్యతతో, ఉత్సుకతతో సాగి ఆ మీదట ఫార్ము లా పద్ధతి నెన్నుకు చక్కటి యూని ఫారమ్స్ గల శరభయ్య ప్రయివేట్ ఆర్మీని రంగంలోకి దింపుతుంది. తన ఆత్మత్యాగంతో ప్రేమ జంటకు పరిణ యం జరిపిస్తాడు ధర్మతేజ. సీతారామ శాస్త్రి పాటలు, సాయినాధ్ మాటలు, విద్యాసాగర్ సంగీతం బావున్నాయి. దర్శకులు: పేరాల. నిర్మాత : కళ్యాణీ కంబైన్స్.

ఇతివృత్తం అనగా కొన్ని సంఘ టనలూ స్వభావాలూతో కూడిన గమ నం. ఆ గమనానికి తుదీ, మొదలూ ఉంటాయి. ఎక్కడనుంచి ప్రారంభమై ఎక్కడ అంతమవుతున్నదీ తెలుసు కోవడంలోనే దానికి పూర్ణత్వం అబ్బు తుంది.

పురుషులు వింతజీవులు ; వారిని క్రమమార్గాన పెట్టడమనేది ఒక నేర్పు - అంటుందామె .... నేను పదిహేడేళ్లు పోషించాను ; కాస్త మార్పుకిగాను కొంతకాలమామె తనని తను పోషిం చుకుంటే తప్పేమిటి ? - అని అడుగు తాడతను.

—మామ్

# క్షయ రోగంతో పోరాడండి

1 రెండు వారాలకు మించి ఎడతెరిపి లేకుండా మీకు దగ్గు ఉన్నప్పుడు లేక ఉమ్మిలో రక్తాన్ని గమనించినప్పుడు ఊపిరితిత్తులకు సంబంధించిన క్షయ రోగంతో మీరు బాధపడుతూ ఉండవచ్చు

2 మీ సమీప మందలి ప్రాథమిక ఆరోగ్య కేంద్రం డిస్పెన్సరీ లేక టి బి సెంటరులో ముఖ్యంగా మీ ఉమ్మితో సహా మిమ్మల్ని పరీక్ష చేయించుకోండి












3 నిర్ధారిత సమయం వరకు క్రమంగా డాక్టరు ఇచ్చిన సలహా ప్రకారం మందులను తీసుకున్నట్లయితే క్షయ రోగాన్ని నయం చేయవచ్చు

4 చికిత్స కంటె ముందు జాగ్రత్తలు తీసుకోవటం ఎప్పుడూ మంచిది అందుచేత మీ బిడ్డకు బి సి జి టీకాలు వేయించండి



సెంట్రల్ హెల్త్ బ్యూరో (డి జి హెచ్ ఎస్)
మినిస్ట్రీ ఆఫ్ హెల్త్ అండ్ ఫ్యామిలీ వెల్ఫేర్
కోట్లా రోడ్డు న్యూ ఢిల్లీ 110002

davp 88/412 TE

సీరియల్

# మంజీరి

## అన్నపూర్ణారెడ్డి

గడిచిన కథ : ఎన్ని విధాల ప్రశ్నించినా అన్నగారు సారథి. జానకికి ఆ యింట్లో గల స్థానమేమిటో చెప్పడం లేదు. గాయిత్రికి పుడుకుమోత్తనంగా ఉంది. వొదిన స్థానం జానకికి యిచ్చాడా ? పిల్లలు ఆమె చుట్టూ 'పిన్నీ, పిన్నీ' అని తిరుగుతారేమిటి ?........ ఇక చదవండి

కంటి వెంట జాలువారే కన్నీటిని పమిటతో అదిమి పట్టడం జానకి కంట పడింది. నట్టింట ఆడపిల్ల కంట తడిపెట్టడం కేవలం తన మూలకంగా అనుకొనేసరికి మరింత గుబులు చుట్టుకుంది. ఎవ్వరికీ చెప్పకుండా వెళ్ళిపోవాలన్నంత ఆవేశం కల్గింది.... కానీ ఏమూలనో వివేకం హెచ్చరించింది. తలుపు తెరచుకొని వెనుకగుమ్మంలో కూర్చుండిపోయింది జానకి.

కుర్చీ ప్రక్కనే వదలి వేసిన పెన్ను కోసం తిరిగి హాల్లోకి వచ్చాడు సారథి.

"జానకి గురించి అంత అభిమానం. అక్కర నీహృదయంలో వుంటే, పోనీ, వదినకు విడాకులిచ్చి జానకినే ఎందుకు చేసుకోకూడదు ? ఈ డొంక తిరుగుడు మాటలు వ్యవహారాలు ఎందుకు ?" - నిలవేసింది గాయత్రి.

కిటికీ చువ్వలు పట్టుకొని వీధిలోకి చూస్తూ "వివాహ బంధాలు విడాకులతో చెల్లి పోతాయన్న నమ్మకం నాకు కల్గినప్పుడు నీ సలహా తప్పకుండా పాటించడానికి ప్రయత్నిస్తాన్నాను, చెల్లీ"

"పొసగని కాపురాలు, కలవని మనసులు మరి విడాకులతో చెల్లక, అట్టిపెట్టుకొని వున్నాయా? చట్ట రీత్యా బంధ విముక్తులు కావడం లేదూ ?

"అవుతున్నారు.... చట్టం ఒకందుకు ఉపకరిస్తుంది. ఇంతకు ముందే చెప్పాను చట్టం ద్వారా విడిపోయినా ఆ బంధం విడదనే నమ్మకం నాకున్నంత వరకూ వీలుపడదని! ఆ నమ్మకం సడలితే, అప్పుడే చూద్దాం."

"అవును అప్పుడే చూస్తావుమరి! రోజులు నిశ్చింతగా జరిగిపోయేప్పుడు తాపీగా ప్రతివ్యక్తీ మాట్లాడగలడు. అయినా, అన్నయ్యా, పిల్లల భవిష్యత్తు గురించి ఏనాడయినా ఆలోచించావా ? వాళ్ళ లేత జీవితాల్లో నీవు అచరించే పద్ధతులు వల్లెవేసే నీతులు ఎలా ప్రతిబింబించి కడపటికి ఎలాటి దుష్పరిణామాలు ఎదుర్కోవాలో ఆలోచించావా ?"

"నాజీవిత విధానం పిల్లలజీవితాలపై ప్రభావం చూపుతుందని నేననుకోను. ఈ వయసులో పిల్లలకు కావలసింది ప్రేమ, అభిమానం, క్రమశిక్షణ. వయసు మీద పడేకొద్దీ ప్రతి వ్యక్తి తనకంటూ ఓ ప్రత్యేకత, వ్యక్తిత్వాన్ని పెంచుకొంటాడు. పెద్దవాళ్ళయ్యాక ఎవరి జీవితాలెలా మళ్ళుతాయో చెప్పడం ఎవరితరం? అంతకుమించి ఏదైనా సంభవిస్తే మేనత్తవు నువు లేవూ?" - మాటలు తుంచేసి గదిలోకి వెళ్ళిపోయాడు సారథి.

మహిళా మండలి వాళ్ళు వచ్చివెళ్ళి నప్పటి నుండీ జానకి మనసు సన్నని రంపపుకోతకు గురిఅయింది. దానికి తోడు అన్నాచెల్లెళ్ళ సంభాషణ. ఎంత వద్దనుకున్నా చెవిలో పడుతోంది. ఆ నిశీధిలో కట్రాటలా కూర్చుండి పోయి ంది. మాట మాటకీ నట్టింట కళ్ళ నీళ్ళు వొత్తుకొని చిన్నబోయిన వదనంతో కూర్చున్న గాయత్రి రూపంగుర్తొచ్చి మనసులో మరింత కలవర పడి పోయింది. జానకికి ఆ రాత్రి నిద్ర కరువైంది.

## 11

మరుదినం హెల్త్ సెంటరుకు వెళ్ళ బోతూ వంటింటిలోకి తొంగిచూచి 'జానకీ' అని పిల్చాడు సారథి.

లేచింది లగాయతు ముఖంచాటు చేసుకు తిరుగుతున్న జానకి, పిలుపువిని చాటుగా నిలిచి "పిలిచారా" అంది.

'ఆ! గాయత్రికి సున్ని వుండలంటే చిన్నప్పటి నుండీ ఇష్టం. నీకు కుదరక పోతే ప్రక్కింట ఆమెనడిగి ఎలా చేయాలో తెలుసుకొనిచేయి. కావలసిన సరుకులు లిస్టు పంపిస్తే తెప్పిస్తాను' అంటూ వెనుతిరిగాడు.

"అలాగే" అంది జానకి.

కాఫీ టిఫిను ముభావంగా ముగించి గదిలో కెళ్ళి ముసుగు తన్నింది గాయత్రి.

ఒంటి పూట బడి అని పిల్లలు పెందరాళే వెళ్ళిపోయారు.

శీను, చైతన్య అఖరు బాబును ఆడించుకొంటూ వసారాలో కూర్చు న్నాడు. జానకి వంటింట్లో పనిచూచుకో సాగింది.

శీను, చైతన్య గబ గబా వంటింటి లోకి వచ్చి నుంచున్నారు.

"ఏమైనా కావాలా బాబు" అంది పనిలో మునిగి వున్న జానకి.

"మాకేం వద్దు"

"పోనీ అలా కూర్చోండి.... ఊరి దగ్గరి కబుర్లు చెప్పండి.... వింటాను" అంది.

"ఏయ్!.... అది సరే" అనుకోని ఈ సంబోధనకు నివ్వెరపోయింది జానకి. అలాగే చూస్తూండిపోయింది.

"నీకు ఏంకావాల్సి మామయ్యను పెళ్ళిచేసుకున్నావు? ..." శీను దూకుడుగా అడిగేసరికి అప్రతిభురాలై "బాబు అంత పెద్దమాటలు మీరు మాట్లాడకూడదు" - అంది మంద లింపుగా.

"ఏం .... ఎందుకు మాట్లాడ కూడదు? మా మామయ్య డబ్బు కోసంకాదు - నీవు మామయ్యను పెళ్ళి

చేసుకుంది'' - నడుం మీద చేయి పెట్టుకొని నిటారుగానుంచొని అడిగాడు శీను.

"బాబూ తప్పమ్మా. చిన్న పిల్లలు తెలిసీ తెలియనివి మాట్లాడకూడదు"

''మేమేం చిన్న పిల్లలం కాదు. నేను నాలుగు పేసయ్యాను. మాచెల్లి రెండు పేసయ్యింది!'' - కళ్ళు తిప్పి గర్వంగా చెప్పాడు శీను.

"ఆలాగా నాకు తెలీదే'' అంది వాతావరణం తేలిక చేసే వుద్దేశ్యంతో జానకి.

''మరైతే నీవెందుకున్నావు ఇంట్లో'' చైతన్య కాస్త ముందుకొచ్చి నిలబడింది.

పిల్లలు నడుముల మీద చేతులుంచుకొని చెరోప్రక్క నిలబడి నిలదీస్తుంటే, ఏమని బదులు చెప్పాలో తోచక క్షణకాలం నిలబడి పోయింది జానకి.

గదిలో పడుకున్న గాయిత్రికి పిల్లల మాటలు అమృత పేయంగా వున్నాయి. సభ్యత కోసమైతేనేం, మరిదేని కోసమైతేనేం తాను అడగలేని ప్రశ్నలతో పిల్లలు జానకి మీద దండెత్తడం, గాయపడ్డ అభిమానం మీద పజల్లులా సోకాయి.

రసవత్తరమైన ఘట్టంలో తెర పడ్డట్టు, 'పెద్దమ్మా! కొట్టకు కొట్టద్దు పెద్దమ్మా!' అంటూ పెద్దగా ఏడుస్తూ రవి వాళ్ళ బెడ్‌రూమ్‌లో మంచం క్రింద దూరాడు నారాయణ.

గడ బిడకు హాల్లోకొచ్చారందరూ. చింతచిలక చేత పుచ్చుకొని రొప్పుతూ నుంచొని వుంది ప్రక్కింటి సీతారామమ్మ.

'ఏం జరిగింది, పిన్నీ .... నారాయణ అల్లరి చేసి హైరానా పెట్టినట్టున్నాడు' అంటూ చిరునవ్వుతో వరండాలోకి వచ్చింది జానకి.

"ఒరేయ్! నారిగా.... బైటకు చావు. అష్ట దరిద్రుడా!.... పురిట్లోనే పోయావుగావు .. బతికి ఎవరినుద్ధరించడానికి.... ఎప్పుడూ అల్లరి, ఆగడం.... రా ....లేకపోతే వీపువిమానం మోత మోగిస్తా" - వరండా దిగువ నుంచుని గట్టిగట్టిగా కేకలెయ్య సాగింది సీతారామమ్మ.

చొరవగా ఆవిడ చెవిలోని బెత్తం లాక్కొని ''రండి పిన్నిగారూ.... వాడేదో కుర్రకుంక.... అల్లరిచేశాడని పెద్దవారు మీరింతగా హైరానా పడకూడదు. ఆరోగ్యం దెబ్బతింటుంది,'' అంటూ భుజం చుట్టూ చేయివేసి హాల్లోకి నడిపించుకు వచ్చి కుర్చీలో కుర్చొండ పెట్టింది. లోనికి వెళ్ళి గ్లాసులో కొద్దిగా షర్బత్ తెచ్చియిచ్చి, త్రాగండి ఎండ పొద్దు - అంది జానకి.

జానకి ఆప్యాయతకు కదలిపోయిన సీతారామమ్మ కళ్ళెత్తి ఓ మాటు జానకి వంక చూచి షర్బత్ గ్లాసందుకొంది.

కాళీగ్లాసు నేలమీదుంచేసి కొంగుతో ముఖం తుడుచుకొంది సీతారామమ్మ.

"పిన్ని గారూ,.... మీరు స్వీట్లుఅవీ చాలా అమోఘంగా చేస్తారు కదా!.... డాక్టరుగారు మీసాయం తీసుకొని సున్ని వుండలు చేయమని అన్నారండీ .... పని ముగించుకొని నేనే వద్దామనుకున్నాను'' అంది.

"దాని దేముందమ్మా. అలాగే.... మధ్యాహ్నం నుండీ కూర్చుంటే ఓ రెండు గంటల్లోచుట్టేలేమూ ?.... నేయీ అదీ కావాలంటే మా ఇంట్లోనే వుంది"

"అవసరం వస్తే అలాగే తీసుకుంటా లెండి," జానకి అంది.

తరువాత కబుర్లలో పడి తాత్కాలికంగా నారాయణ విషయం మర్చిపోయి ఇంటికెళ్ళి పోయింది సీతారామమ్మ.

విజ్జి, రవి స్కూలునుండి వచ్చి తమ గదిలో నక్కిన శాస్త్రీని చూచి, నవ్వుతూ బెటకి లాగారు.

"అమ్మో .... పెద్దమ్మ చంపేస్తుంది" అంటూ భయంగా మంచం క్రిందేవుండి పోయాడు వాడు.

## 12

మధ్యాహ్నం దినుసులన్నీ పుచ్చుకొని సీతారామమ్మ ఇంటికెళ్ళింది జానకి.

సున్నివుండల కార్యక్రమాన్ని ప్రారంభించాక కబుర్లు లోకాభిరామాయణం వైపు మళ్లాయి.

"పిన్నిగారూ మధ్యాహ్నం నారాయణ మీద ఎందుకంతగా కోప్పడ్డారు ?" - చిరునవ్వుతో అడిగింది జానకి. కోపం చల్లారిన స్థితిలో "ఏం చేయను జానకమ్మా .... వీడు ఏ దుష్ట గడియలో భూమ్మీద పడ్డాడోగానీ బ్రతికుండగానే నరకం చూస్తున్నాను," అంది.

"నారాయణకు తల్లి లేదా ?"

"తల్లి వుండి మాత్రం లాభమేముంది ? వాడి తల్లినని చెప్పుకో లేని సితిలో వాడికి తలి అయింది"

"అంటే"

"ఉద్యోగం చేసుకొంటూ అక్కడెక్కడో కోస్తా జిల్లాల్లో వుండి పోయింది నాచెల్లి. పెళ్ళి చేసుకుంటానని వాడెవడో దీన్ని తల్లిని చేసి చక్కా పారిపోయాడు. దానికి వీడు వురి ఎందుకని. అటు వదల్చుకోనూ లేక తెంచుకోనూ లేకపోతున్నా. అయినా వీడు చూడమ్మా .... కొరకరాని కొయ్య !"

"ఏం చేశాడేమిటి ?"

"ఇంకా ఏం చేయాలి ?" ఊళ్లో పరువు మర్యాదలు మిగిలేటట్టు లేవు. ....ఆ పెద్ద బజారులో కిరాణాకొట్టు నవరత్నం లేదూ, ఆ మహాతల్లితో తగూ తెచ్చుకున్నాడు. నేనిందాక పొలం వెళ్లి వస్తూంటే నవరత్నం పిల్చి మరీ ఫిర్యాదు చేసింది."

"ఏమట ?"

"కొట్టుమీదికి రాళ్ళిసిరాడట"

"నారాయణ ఏమంటాడు?"

'నేను చింత చెట్టుమీదికి విసిరాను - అని వాడంటాడు."

"నారాయణ మాటంటే నమ్మకం లేదా మీకు ?"

"అ.... ఏం నమ్మాలో ఏమో ? తెల్లవారి లేచింది ఏదో ఒక పేచీ. ఊళ్లో తలెత్తుకోలేక ఛస్తున్నా.... వురిట్లో చచ్చినా పీడా వదిలి పోయుండేది. బ్రతికెవరి నుద్ధరించడానికి?"

ఇద్దరి మధ్య మౌనం....

"పిన్నిగారూ మీకు చెప్పేంతటి దాన్ని కాదనుకోండి.... నారాయణకు ....మీరంటే వల్లమాలిన అభిమానం.

బెత్తంతో కాక ప్రేమతో అర్థంఅయ్యేలా చెప్పితే నారాయణ తప్పక వింటాడని నా నమ్మకం .... పిల్లలకు పసితనంలో ప్రేమాభిమానాలు కొరవడితే మాన సికంగా కృంగి ఓవిధమైన నిరాశతో కృంగుతూ ఇష్టం వచ్చినట్టు ప్రతి కేయడానికి అలవాటుపడి సమాజానికి చీడపురుగుల్లా తయారయ్యే ప్రమాదం వుంది. నారాయణ అలాటివాడవు తాడని కాదు - కాని తను ఎవరికీ అక్కరలేని వాడిననే భావం మనసులో ఇప్పటికే నాటుకుందని నా అను మానం.''

''ఏం చేయను జానికమ్మా.... వాడి జన్మకు ఏడ్వని రోజు లేదు. తల్లి ప్రేమకు నోచుకోక, తండ్రెవరో తెలీక పెరిగే ఆ బిడ్డంటే ఈ గుండెల్లో ఏదో విపరీతమైన వేదన'' - కళ్ళొత్తుకుంది సీతారామమ్మ.

''మీ నీడన అతడికి లోటు రాదు, పిన్నిగారూ.... మీరుపడే ఆవేదనే అందుకు నిదర్శనం''

కబుర్లు పూర్తయ్యేసరికి ఘుమ ఘుమలాడే సున్నివుండలు పళ్ళెంలో కొలువుతీరి కూర్చున్నాయి.

''చాలా థాంక్సండీ, పిన్నిగారూ! వస్తాను. డాక్టరుగారు హెల్త్ సెంటరుకి వెళ్ళే వేళయింది'' అంటూ దొడ్డిదారి గుండా తమ ఇంటివేపు కదలి వెళ్ళింది జానకి.

బట్టలు కొనుక్కోమ్మని గాయిత్రికి డబ్బు యిచ్చాడు సారథి. గాయిత్రి, పిల్లలు వెళ్ళిపోయాక ఇల్లంతా బోసి పోయినట్టయింది.

ప్రశాంత సరోవరంలో రాయివిసిరి నట్టు జానకి మనసులో అలజడి జటు కుంది.

## 13

పిల్లలు పడుకున్నాక దుప్పట్లుకప్పి దోమతెరలు దించి హాల్లోకి వచ్చింది జానకి.

సారథి గది తలుపులు తెరిచే వున్నాయి. లోపల లైటు వెలుగు తూంది. ఒక్కోసారి ప్రొద్దుపోయే వరకూ మేల్కొని ఏ పుస్తకమో చదు వుతూ కూర్చుండి పోవడం సారథికి అలవాటే.

అదిరే గుండెలను చిక్క బట్టుకొని సారథి గది ముందు నిలిచి ''బాబు గారూ!'' అని పిల్చింది జానకి. ఆ కంఠంలో సన్నని వణుకు.

గత కొన్ని మాసాలుగా ఆ ఇంట మనిషిగా మసలి, సారథి ఆలనా పాలనా చూచినా, ఆనాడు డాక్టరును పిలువాలంటే పిరికితనం చుట్టు కుంది.

లోపల ఎలాటి అలికిడి తేకపోయే సరికి తలుపుమీద చిన్నగా చప్పుడు చేసింది.

''ఎవరూ'' - సారథి గొంతు.

''జానకిని''

సారథి గది సర్దాలన్నా, తుడవా లన్నా అతడు లేని సమయంలో పను లన్నీ ముగించుకోవడమే గానీ ఎట్టి పరిస్థితిలోనూ అతడుండగా గదిలో అడుగుపెట్టని జానకి, గడప వెలుపలే నుంచుంది పోయింది.

(ఇంకా వుంది

# డైరీ

## 1988 అక్టోబరు 01

సాహిత్య అకాడమీ ప్రాంతీయ కార్యాలయంవారు 'సాహిత్య సుధ'తో సంయుక్తంగా ఏర్పాటు చేసిన సారస్వత సాయం సమయంలో, మద్రాసు యూనివర్సిటీలోని కన్నడ శాఖ ప్రొఫెసర్ కుశాలప్పగౌడ, కంబ రామాయణంలోని విశిష్టతను, సౌందర్య లక్షణాలను వివరించారు - రామారావు కళామండపంలో, వాల్మీకి రచనలో రాముడు మానవోత్తముడు కాగా, కంబన్ తులసీదాసులు రాముణ్ణి దేవుణ్ణి చేశారు. అది కాలప్రభావమంటారు విమర్శకులు.

## 1988 అక్టోబరు 02

డియమ్‌కెవారి సువిశాల ప్రాంగణంలో ఈ ఉదయం, గాంధీ పుట్టినరోజున, 'ఖైదీ 786' శతదినోత్సవ వేడుక. పొద్దుట పూర్వరంగం - సాయింత్రం అసలు ఫంక్షన్. ఉదయంవేళ ప్రెస్‌కీ, పిక్చర్ విజయానికి తోడ్పడ్డ సాంకేతిక నిపుణులు, కళాకారులు, పంపిణీదారులు, ప్రదర్శకులు, కోనుగోలు దారులకు షీల్డ్స్ అందజేయడం.... యిలా పరిమిత సంఖ్యలో సమావేశం. భారీ ఎత్తున అభిమాన సంఘాల జయ ధ్వానాల సభ సాయింత్రం.... విజయ బాపినీడు నిర్వహించే ఫంక్షనులకి ఆయన ప్రత్యేక వరవడి ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఒకసారి చేసినట్టు మరొకసారి చేయరు. ఆ విన్నూత దోరణి పది మందినీ ఆశ్చర్య చకితులు గావిస్తుంది. సుమారు వెయ్యిమంది ఆహూతులకు, వారి కలర్ ఫొటో ఆకర్షణీయమైన యాంగిల్‌లో తీసినది, అందులో ఇన్‌సెట్‌గా, తెరిస్తేగాని తెలియని విధంగా అతికించి, మీరు ఈ వేడుకకు ముఖ్య అతిధి అంటూ పిలవడం, ఆ అపురూప ఆహ్వాన పత్రం, ముఖ్య అతిధి చేతుల్లోకి తనవారి ద్వారా పర్సనల్‌గా అందజేయించడం, ప్రపంచ సినీ చరిత్రలోనే యింతటి ప్లానింగ్‌తో, యింతటి మనోరంజనతో, యింతటి వ్యక్తి గతానుబంధంతో ఎవరూ చేసివుండరు - మాకు తెలిసినంతవరకూ ! ఆహ్వానంతోబాటు తన బొమ్మ వున్న కీ - చైన్. విజయోత్సాహాన్ని తన వారందరితో మనస్ఫూర్తిగా పంచుకొనే స్వభావం విజయబాపినీడుది.... 'ఖైదీ 786' నలభై

కేంద్రాలలో నూరురోజులు ఆడింది - యింకా కొన్నిచోట్ల ఆడుతోంది.... "సుశిక్షణ, సత్ప్రవర్తనపట్ల విశ్వాసం గల గోపి (చిరంజీవి) కానిస్టేబుల్ ఉద్యోగంలో చేరుతాడు. శాంతి భద్రతలు కాపాడుతూ ప్రజలకు రక్షణ నీయవలసిన శాఖ, స్థానిక రాజకీయులకు అమ్ముడు పోవడం కళ్లారా చూసి, పోలీసు జులుమ్‌కి బుద్ధిచెప్పి, ఉద్యోగానికి రాజీనామా యిస్తాడు.... పంచాయితిలో ప్రియురాలి (భాను ప్రియ) కమ్చీ దెబ్బలు తిన్న గోపి, ఆమె మెడలో అమాంతంగా మంగళ సూత్రం కడతాడు - యావజ్జీవ బానిస వని కసిగా అంటూ!.... మొసళ్లది ఈ చిత్రంలో ఒక ప్రత్యేక ఘట్టం.... అనేక వీరోచిత కార్యాలు జరిగాక సత్యం జయిస్తుంది; ప్రేమకు పట్టాభిషేకం జరుగుతుంది" - ('జగతి' 386 - సెప్టెంబరు 1988).... ప్రేక్షకాభిరుచిని మన్నిస్తూ, కొత్త బాటలో అడుగిడుతూ, అన్ని తరగతుల వారినీ మెప్పించే దర్శక నిర్మాత విజయబాపినీడు. ఆహూతుల ఇన్విటేషనుల నుంచి చిరంజీవికి ఏనుగు యివ్వడందాకా అంతా కొత్తదనమే ... పోయిన సంవత్సరం అక్టోబరు రెండో తేదీన గోపాలరెడ్డిగారు సబర్మతీ ఆశ్రమం సందర్శిస్తున్నప్పుడు, సంవత్సరానికొక్కరోజైనా చొక్కాలేకుండా వుంటానని ప్రతిన తీసుకున్నారట; చిన్నప్పుడు బందరులో చదువుకుంటున్నప్పుడు (1920 ప్రాంతాల) ఒక సంవత్సరంపాటు చొక్కా వేసుకోలేదు- గాంధీగారి జాతీయోద్యమ ప్రభావంగా! ఆ తర్వాత శాంతినికేతన్ వెళ్లారు; శాంతి సమరంలో పాల్గొని అనేకసార్లు శ్రీకృష్ణ జన్మస్థానం చూశారు; 1937 లో మద్రాసు రాష్ట్రమంత్రి అయ్యారు. ఆ తర్వాత ఆంధ్రా ముఖ్యమంత్రి; కేంద్రంలో మంత్రి; యుపి గవర్నర్ - యిలా అత్యున్నత స్థానాలు అందుకొన్న నిష్కళంక కాంగ్రెస్ నాయకులు. నెల్లూరు వచ్చినప్పుడు ప్రధాని రాజీవ్ గాంధీ, పూజ్యులు గోపాలరెడ్డిగారిని ప్రస్తుతించారు - ఈయన మొదటి మంత్రిత్వం రోజులకి రాజీవ్ యింకా పుట్టలేదు. ఎనభైదాటిన గోపాలరెడ్డి గారి మాటలలో ఎప్పుడూ ఏవో కొత్త విషయాలు దొర్లుతూంటాయి - పది హేనేళ్లగా మాకు బాగా తెలుసు - కాని, ప్రతిసారీ ఏవో కొత్తసంగతులు వస్తూనే వుంటాయి, ఆయన అపారానుభవం నుంచి ...."కళాపీఠం అవార్డులు అక్టోబరు రెండున పెట్టుకున్నారు - నన్ను రమ్మంటున్నారు. నేనారోజున చొక్కా వేసుకోను. చొక్కా లేకుండా పైపంచె కప్పుకు వేదిక మీదకువస్తే మీకు అభ్యంతరమా?" - అని అడిగారట యార్లగడ్డ శంభుప్రసాద్‌ని. 'అదేమిటి, సార్, మీయిష్టం, మీ నియమం' అన్నారటాయన. ఇవ్వాళ శంకర దాస్‌లో కళాపీఠం ఫంక్షన్! రేపు ఫిలిమ్ ఛాంబర్లో పసల సూర్య చంద్రరావు 80 వ జన్మదినోత్సవం. ఈ రెండింటిలో గోపాలరెడ్డిగారు పాల్గొంటున్నారు. శ్యామ్‌ప్రసాద్ ఫంక్షన్ నుంచి యింటికొచ్చేసరికి

ఆయన వచ్చివున్నారు. "గాంధీ మండపానికి వెళ్దామా" అన్నారు. ఆ పవిత్ర స్థలం సందర్శించి నిశ్శబ్ద నివాళులర్పించడం ఆయనకు చాలా సంవత్సరాలుగా అలవాటని మాకు తెలుసు. మన కళ్లముందు జీవించి ఈ జాతిని జాగృతం చేసిన గాంధీజీ, రాజాజీ వంటివారి స్మారక మంది రాలు గుళ్లూ గోపురాలు కంటె ఎంతో గొప్పవి. పది పదిహేను నిముషాలు గాంధీ మండపంలో గడిపి, నన్ను పొట్టి శ్రీరాములు హాలు వద్ద దింపి, ఆయన బెట్టినాడ హవుజ్‌కి వెళ్లిపోయారు - సాయంత్రం అయిదు గంటలకి రెడీగా వుండమని చెప్పి! (కళాపీఠం ఫంక్షన్) ....పొట్టి శ్రీరాములు స్మారక సమితి వారు 'గాంధీజయంతి' విధిగా జరుపుతారు - ఈ సంవత్సరం ముఖ్యఅతిథి వావిలాల గోపాలకృష్ణయ్య .... "ఈ సభలో నాకు పాతిక ముప్ఫయ్యేళ్ల వారు ఒక్కరు కనిపించడంలేదు - అంతా నలభై, నలభై పైబడ్డవారే! గాంధీజీ సిద్ధాంతాలూ అభిప్రాయాలూ యువతకి అందడం లేదు - వారికీ మనకీమధ్య గలదూరం ఆ నాటికానాడు ఎక్కువవుతోంది. యువతలో గాంధేయ భావాలు నాటుకొనేటట్లు చేయాలి; వారిని గాంధీయిజమ్ వైపుగా మళ్లిం చాలి" - అన్నారు వావిలాల. ఆయన పలుకుల్లో ఆశాభావమూ ఆప్టిమిజమే తప్ప, నైరాశ్యత లేదు..... మీటింగ య్యాక మాటలలో, "స్వాతంత్ర్య పత్రం ('జగతి'లో వెలువడుతున్నది) పూర్తిగా చదవాలని ఉంది" - అన్నారు. 'పాత కాపీ వెతికి మీకు పంపుతాను' - అన్నాను. వెతికి పం పేందుకు ఏడెనిమిది వారాలుపట్టింది. పాతికేళ్ల క్రితం తెలుగుపాఠకులకోసం రాసిన పుస్తకం, వావిలాల గోపాల కృష్ణయ్యగారి లాటి వారిని అంతగా ఆకట్టుకున్నదంటే ఎందుకు సంతో షంగా ఉండదు?.... క్రిందకొచ్చేసరికి ఎవరినో కారులో జాగర్తగా కూచో పెడుతోంది మాలతి - కారు కదిలాక చెప్పింది అమ్మనరాజా గారని. హైదరాబాదులో ఉంటున్నారట - పనిమీద మద్రాసు వచ్చారట - మైలా పూరు రాయపేట హైరోడ్‌లోని పొట్టి శ్రీరాములు స్మారక భవనంలో జరిగే గాంధీజయంతి, యించుమించు అవతల కొసనున్న సాలిగ్రామ్‌నుంచి (స్త్రీసేవా మందిర్‌లో ఆమె బసచేశారు), ఒక హెల్పర్‌ని వెంటబెట్టుకొచ్చారు. ఒక నాటి నాయక వర్గానికి గాంధీజీ జ్ఞాపకాలు దివ్య పారిజాతాలు.... తను సాలిగ్రామ్ చేరుకొనేలోపున (జర్నీ టైమ్ కారులో అరగంట) టివి మహా భారతం ప్రథమఘట్టం ప్రారంభించేస్తా రేమోనని, మాయిల్లు పొట్టిశ్రీరాములు హాలుకి మూడునిముషాల దూరమే గనక, యిక్కడ చూసి వెళ్దామని వచ్చారు. ఆమెకీ యించుమించు ఎనభై వస్తున్నాయి; వావిలాల వారికి ఎనభై దాటాయి; గోపాలరెడ్డిగారికీ అంతే; మోటూరి సత్యనారాయణ గారైతే ఒక విజ్ఞానసాగరం; ఎనభైదాటిన ఈ గాంధేయవాదులలోని చైతన్య దీప్తి

నేటి ప్రజానీకానికి ఎందువల్ల అందడం లేదు? సాహిత్యమూ, సినిమాలు, సెన్సేషనలిజమ్ యువతని నిస్తేజం చేస్తున్నాయా? ఎందువల్ల గమ్యతరహితమవుతున్నది యువశక్తి? సామాజిక శాస్త్ర కోవిదులు పరిశీలింప దగు అంశమది .... 1986 ఏప్రిల్ 6వ తేదీన తన 75వ ఏట పరమ పదించిన యార్లగడ్డ వెంకన్నచౌదరి స్మృత్యర్థం ఆయన కుమారుడు శంభుప్రసాద్ ఒకలక్ష రూపాయిల జాతీయ బహుమతి నెలకొల్పారు. పోయిన సంవత్సరం ఆ లక్షని రెండుగా విభజించి ఏభైవేలు ఆంధ్రముఖ్యమంత్రి యన్‌టి రామారావుకి, ఏభైవేలు సైంటిఫిక్ అడ్వయిజర్ మీనన్‌కి అని ప్రకటించారు. 1987 మే నెలలో జరిగిన బహుమతి ప్రదానోత్సవానికి మీనన్ రాలేదు ; యన్‌టిఆర్ వచ్చారు. తను స్వీకరించిన ఏభైవేలు ఒక విద్యాసంస్థకు విరాళంగా యిచ్చేశారు యన్‌టిఆర్... ఈ సంవత్సరం ఏభై వేల బహుమతి వివాలాల గోపాలకృష్ణయ్యగారికని ప్రకటించారు. తను స్వీకరించిన ఏభైవేలూ వావిలాల వారు ఒక సేవాసంస్థకు విరాళంగా యిచ్చేశారు. నిరుడు సంవత్సరం మ్యూజిక్ అకాడమీలో జరిగింది ; ఈ సంవత్సరం శంకరదాస్ ఆడిటోరియమ్‌లో ; ఇది నాన్ - ఎసి అవడంవల్ల విపరీతమైన వుక్క ; గాలి ఆడలేదు. అయినప్పటికీ ఎంతో వోపికగా కూచున్నారు. సభాధ్యక్షులు ఆవుల సాంబశివరావు. ఈ సంవత్సరం సావిత్రి అవార్డ్ వాణిశ్రీకి యిచ్చారు. వివరంటా వుండాలని అనిపించింది గాని యితరత్రా పనుల వల్ల సాధ్యపడలేదు. తమకుటుంబ ఆదాయం నుంచి ఏటా లక్షరూపాయిలు బహుమతిగా యిద్దామని సంకల్పించిన ఏకైకవ్యక్తి యార్లగడ్డ శంభుప్రసాద్. దేశం మొత్తం మీద మరికొందరు ఉండవచ్చు. కాని, తెలుగు వారిలో ఈయనొక్కరే - అందుకుగాను శంభుప్రసాద్ ఎంతగానో ప్రశంసనీయులు, అభినందన పాత్రులు.

. . . . . 03

ఫిలిమ్ ఛాంబర్ ఆడిటోరియమ్‌లో వావిలాల గోపాలకృష్ణయ్య ప్రారంభకులుగా, బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షులుగా పసల సూర్యచంద్రరావు 80వ జన్మదినోత్సవ వేడుక. కార్యక్రమ నిర్వాహకులు : రాళ్లబండి కామేశ్వరరావు, గుమ్మడి, మిక్కిలినేని, ఇంటూరి, పుండరీకాక్షయ్య, భమిడిపాటి రాధాకృష్ణ ప్రసంగించారు. వింజమూరి పద్మశ్రీ దీపారాధన చేయగా, కొవ్వలి నాగేశ్వరరావు వందన సమర్పణ .... ఆంధ్రరాష్ట్ర అసెంబ్లీలో డిప్యూటీ స్పీకరుగా రాణించడమే గాక తెలుగు నాటక రంగానికి అనన్య సేవ చేసిన కళాప్రపూర్ణుడు పసల సూర్య చంద్రరావు - అన్నారు వావిలాల. "వావిలాల సిసలైన గాంధేయ వాది కాని కాంగ్రెస్ వాది మాత్రం కాదు ; నేను సిసలైన కాంగ్రెస్ వాదిని - నాలో గాంధీయిజమ్ ఎంత వుందో నాకు తెలీదు" - అన్నారు బెజవాడ

గోపాలరెడ్డి,- నాగార్జునసాగర్‌ని (నంది కొండ ప్రాజెక్ట్) ఆధునిక దేవాలయ మని నెహ్రూ చెప్పిన రోజులు గుర్తు చేస్తూ! తెలుగు నాటకరంగం అభి వృద్ధికి నిర్విరామకృషి సల్పిన పసల సూర్య చంద్రరావు (ఆయనకి ఎనభై ఏళ్లంటే నమ్మలేరు - అంత దీటైన విగ్రహం) ఉచితరీతిని సమాధానం చెప్పారు. ఆర్‌విజికె రంగారావు (రాయలా కార్పొరేషన్ చైర్‌మాన్) సన్మాన కమిటీలో ముఖ్యులు.

. . . . . 07

అలిండియా స్మాల్ అండ్ మీడి యమ్ న్యూస్ పేపర్స్ అసోసియేషన్ (All India Small & Medium Newspapers Association) వారి 50వ స్టాండింగ్ కమిటీ మీటింగుకి తప్పక రావలసిందిగా అధ్యక్షులు ఫరూకీ (Moin Farooqui) రెండు ఉత్తరాలు రాశారు. హైదరాబాదు లోనే కదా అని, వస్తున్నట్టు తెలియ బరిచాను; నాకోసం వసతి సౌకర్యం ఏర్పాటు చేయనక్కరలేదని కూడా రాశాను. .... సాయింత్రం మూడు న్నర ఎక్స్‌ప్రెస్‌లో హైదరాబాదు ప్రయాణం. బెర్తు చూసుకు కూచు న్నానో లేదో రమణయ్య రాజా, ఆయన మిత్రులూ లోనికి వచ్చారు. 'ఎందాక ?' అంటే 'ఒంగోలు' అన్నారు. ఒంగోలు దాకానే గనక, కండక్టరు ఎసి స్లీప రులో యకామడేట్ చేయగలిగారు.... మూడున్నరకి స్టేషన్ వొదలవలసిన రైలు, పావు తక్కువ నాలుగైనా కదలలేదు. ఇంతలో ఎవరో 'ఈట్రయి న్‌లో బాంబు పెట్టారట' - అన్నారు. ఎదుట బెర్తు మీద కూచున్న రాధా కృష్ణ, (గాంధీపేస్ ఫౌండేషన్ జన రల్ సెక్రటరీ, న్యూఢిల్లీ), కృష్ణమూర్తి గార్లకు (అదే ఫౌండేషన్ హైదరా బాదు సెక్రటరీ) గాని, పక్కన కూచు న్న రాజాగారికి గాని, నాకు గాని 'బాంబ్ స్కేర్' నమ్మబుద్ధికాలేదు - మర్నాటి ఉదయం 'హిందూ' చూసే దాకా అది యదార్థమని మాకు తెలి యదు. రైలుముందు కెళ్లింది ; లూప్ లైనులోకి వచ్చింది ; మళ్లీ ముందు కెళ్లింది, మొదట్లో బయలుదేరిన ప్లాట్ ఫారమ్ మీదకి వచ్చింది. 'కప్లింగ్ సరి గా లేని కారణాన చివరి బోగీ రైలుతో పాటు ముందుకెళ్లలేదు. దానిని పికప్ చేసుకునేందుకు రైలు వెనక్కి వచ్చింది' - అని సంజాయిషీ చెప్పారెవరో ! అదే అయుంటుం దనుకున్నాం - మర్నాటి ఉదయం పేపరు చూసే దాకా ! .... రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ గారి సోదరుని కుమారుడు రాధా కృష - ఢిల్లీలో సెటిలయారు గాంధీ పేస్ ఫౌండేషన్ కార్యదర్శిగా. అగస్టు లో మేము అవనిగడ్డలోని గాంధీక్షేత్రం చూడటం, యమ్వి కృష్ణారావుగారు, వారి అబ్బాయి బుద్ధప్రసాద్, జెట్టిగారి తోను, ముగ్గురు స్వామిజీలతోను గడిపిన అమృతక్షణాలు, యిలాటి వెన్నో మాటలలో దొర్లాయి ... రాజా గారు ఒంగోలులోను, రాధాకృష్ణ, కృష్ణమూర్తి గార్లు బాపట్లలోను దిగి పోయాక, నేను నడుం వాల్చాను -

తెల్లారేసరికి సికింద్రాబాదు - ఎనిమిది గంటలకు నారాయణ గూడా టాజ్. . . . . . 08

హైదరాబాదు ప్రెస్‌క్లబ్ భవనంలో ఉదయం పదకొండుగంటలకి ఆలిండియా స్మాల్ అండ్ మీడియమ్ న్యూస్ పేపర్స్ అసోసియేషన్ వారి సమావేశం. కేంద్ర సమాచారమంత్రి హెచ్‌కెయల్ భగత్, ఫంక్షన్ ప్రారంభిస్తూ 'ఇంగ్లీషులో మాట్లాడమన్నారా, హిందీలో మాట్లాడమన్నారా?' అని అడిగారు. సభ రెండుగా చీలి హిందీ ఇంగ్లీషు అని నినదించడంతో, రాజకీయనిష్ణాతులైన భగత్, ఇంగ్లీషులో ప్రధానాంశాలన్నీ మాట్లాడి, చివర్న హిందీలోకూడా మాట్లాడారు. "సమాచార వ్యాప్తిలో, సారస్వతాభివృద్ధిలో ఏ మీడియమ్‌కు గలస్థానం దానికుంది. ప్రింట్ మీడియాకు, మనదేశంలో టివి మూలమూలకు పాకింది - టివికీ సినిమాకీ వైరుధ్యంలేదు; అలాగే సినిమాకి, విడియోకి వైరుధ్యంలేదు. సాంకేతిక ప్రగతిని బట్టి ఆయా సాధనాలు పెరుగుతాయి. సాధనాల కనుగుణమైన సారస్వతం జనిస్తుంది. అన్నిసాధనాల అంతిమ లక్ష్యం ఉత్తమ సామాజిక విలువలు, ఉన్నత సాహిత్య సృష్టీను! మనది అయిదువేల సంవత్సరాల చారిత్రక వారసత్వంగల సంస్కృతి. దీని పరిరక్షణలో తమదైన పాత్ర విజయవంతగా నిర్వహించాలి.... మతం పేరిట, ప్రాంతం పేరిట, భాష







పేరిట వేస్తున్న అడ్డుగోడలనిపడగొట్టి, జాతీయతాభావాన్ని నెలకొల్పాలి.అనేక ఒత్తిడుల కారణంగా పెద్ద పత్రికలు చేయలేనివి, చిన్న పత్రికలు చేయ గలవు, నాకు చిన్నపత్రికలంటే మొద ట్నుంచీ ఎంతో అభిమానం. ప్రజా స్వామ్యానికి అవి పట్టుగొమ్మలు'' - అన్నారు భగత్, తన ప్రారంభోపన్యా సంలో. ఆంధ్ర అసెంబ్లీ స్పీకరు నారాయణరావు పత్రికాస్వేచ్ఛ, విశృం ఖలతకు, నిర్బాధ్యతకు దారి తీయ కూడదన్నారు. అసెంబ్లీలోని ప్రతిపక్ష నాయకుడు బాగారెడ్డి హిందీలో మాట్లాడుతూ, ఎక్కడెక్కడి అన్యాయా లను, చిన్న పత్రికలు వెలుగులోకి తీసుకువస్తున్నాయన్నారు. సింగిల్ కాపీ, పోస్టల్ రేటు పదిహేనుపైసలు నుంచి అయిదుపైసలకు తగ్గించమనీ, న్యూస్ ప్రింట్ సప్లయి విషయంలో చిన్న పత్రికలకు రాయితీ చూపించమనీ, చిన్న పత్రికలకు ప్రకటనలు జారీ చేసే విషయంలో రాష్ట్రప్రభుత్వాలూ కేంద్రప్రభుత్వమూ ఔదార్యం చూప వలసివుందనీ, మెషనరీ కొనుగోలుకి, దైనందిన నిర్వహణకు జాతీయ బాంకులు చేయూతనివ్వాలనీయిలాటివి కొన్నిసూచించారు కార్యదర్శి రాజేం దర్ కుమార్ వర్మ .... సాయంత్రం చిక్కడపల్లి త్యాగరాయగాన సభలోని, 8వ అఖిలభారత తెలుగురచయితల మహాసభలకు తీసుకువెళ్లారు వాసిరెడ్డి సీతాదేవి. మూడురోజుల పాటు ఎంతో ఉత్సాహవంతంగా జరుగుతున్న ఈ మహాసభలకు, ప్రఖ్యాత సాహిత్యవేత్త పోతుకూచి సాంబశివరావు ప్రధాన కార్యదర్శి. ఎంతో ఆప్యాయంగా పల్క రించారు చిరకాలమిత్రులు పోతుకూచి. బొంబయి నుంచి వచ్చిన గులాబ్ దాస్ బ్రోకరు అధ్యక్షులుగా (పోయిన సంవ త్సరం అహ్మదాబాదు కలుసుకున్నా నాయనని), బోయి హైమవతి 'వందే మాతరమ్' తో ప్రారంభమయిందట ఉదయం సభ. పుస్తక చిత్రలేఖన ప్రదర్శనకు ఆవిష్కరణ పొద్దుట జరి గింది. ఇండియన్ రైటర్స్ యూని యన్‌తో సంయుక్తంగా నిర్వహిస్తున్న ఈ సభలలోనిముఖ్యాంశం నెహ్రూశత జయంతి. 'స్వాతంత్ర్య పోరాటం' అనే విషయంపై మధ్యాహ్నం సదస్సుకి సోమంచి యజ్ఞన్న శాస్త్రి అధ్యక్షులు. సాయంత్రం కవితా గోష్ఠి సభకు పద్మ భూషణ్ తిరుమలరావు అధ్యక్షులు - ఎందరో కవులు తమ కవితాగానం వినిపించారు. ఈ మహాసభల వేదిక మీద వాసిరెడ్డి సీతాదేవికీ లతకు సన్మానం చేశారు, ఆతర్వాత జవహర్ బాలభవన్ పిల్లల కల్చరల్ ప్రోగ్రామ్ ప్రేక్షకులని ఎంతగానో రంజింప జేసింది. పది పన్నెండు నిముషాల పాటు పిల్లల ఆర్కెస్ట్రా, రవీ మేఘ్ రాజ్‌ల స్కేటింగ్, శ్వేతపద్మ లంబాడీ డాన్సు, అనిత గోంగూరడాన్సు, జాతర జానపద నృత్యం, మీరా భారతి నాట్యం, సుఖేష్ వేటగాని డాన్సు, నిత్యసంతోషిని పాట, సమత భరత నాట్యం, లంబాడీల సామూహిక నృత్యం - యిటువంటి వాటితో పది పధ్నాలుగేళ్లలోపు బాల బాలికలు,

పొద్దుట్నుంచీ సాహిత్యము, సమైక్యత వంటి సీరియస్ విషయాలలో మునిగి వున్న సభికులకు మనోల్లాసం కలిగిస్తూ యింటికి పంపారు. ఈ పిల్లలని యింత సమర్ధవంతముగా తీర్చి దిద్దడంలో పై నుండి దారిచూపుతూ నడిపించిన జవహర్ బాలభవన్ డైరక్టరు వాసిరెడ్డి సీతాదేవి అభినందనీయురాలు. ఆమె మా ఫామిలీ ఫ్రెండవటం వల్ల అంతకి మించి చెప్పకూడదు. తన రచనలతో పాఠకులని ఆలోచింపజేయడమే గాక, ఈ పిల్లలలోని సృజనాత్మకతకు నవ జీవనమిచ్చి తనస్థానాన్ని సద్వినియోగ పరచుకున్నారు సీతాదేవి.

## 09

జాతీయ సమైక్యతకు సంబంధించిన తెలుగు కవిత (రచయితల సభలో) ఉదయం కాసేపు విన్నాను. సాహిత్యాభివృద్ధిలో పత్రికల పాత్ర గురించిన సమావేశానికి మధ్యాహ్నం తప్పకుండా రావాలనుకున్నాను గాని పడలేదు ; నిన్నటినుంచీ 'ఎవిఆర్‌జి' ని చూడ లేదు ; ఫోనులోకూడా ఆయన దొరక లేదు ; అంచేత, నాలుగు గంటలకి హుమయూన్ నగర్‌లోని 'రిపోజ్' కి వెళ్లాను ; అప్పుడే, అయిదు నిముషాల క్రితమే యింటికొచ్చారు కృష్ణమూర్తి గారు. మాటల సందర్భంగా దివిసీమ ప్రస్తావన వచ్చింది (1988 ఆగస్టు 14 - డైరీ - 'జగతి' - 388).... "తుపాను ఉధృతం కొంచెం తగ్గగానే 22వ తేదీకి అవనిగడ్డ చేరుకున్నాం. మా ఫారెస్ట్ డిపార్ట్‌మెంటులోని వంద మంది ఉద్యోగులూ సిబ్బందీ నాకు సాయంగా పనిచేశారు. నలభై రెండు రోజులు వున్నామక్కడ. ఒక్క అవని గడ్డకే లక్ష వెదురు సప్లయి చేశాము - 76 సైక్లోన్ షెల్టర్స్ నిర్మించాము ఆయా గ్రామాలలో. మొత్తం ముప్ఫయ్యయిదు లక్షల వెదురు తరలించాము ఆ ప్రాంతాలకు" - అన్నారు అటవీ శాఖలోని ఉన్నతోద్యోగి అయిన డా॥ ఎవి ఆర్‌జి కృష్ణమూర్తి ఐయఫ్ ఎస్ - పదేళ్లనాటి జ్ఞాపకాలు గుర్తు చేసుకుంటూ! 'డైరీ' చదవగానే ఆ వెనకటిదంతా మదిలో మెదిలిందట. "సాయంత్రం పార్టీకి మీరొస్తున్నారు. శ్రీనివాస మోహన్ మిమ్మల్ని పికప్ చేసుకు వస్తారు. చిత్తరంజన్ మీకు తెలుసుగాని రామకృష్ణారావు గారిని కలుసుకోలేదు - ఆయన కూడా వస్తారు యు విల్ హావ్ యాన్ ఇంటరెస్టింగ్ టైమ్" - అన్నారు కృష్ణమూర్తిగారు. ....రాజాలక్ష్మీ ఫౌండేషన్ రాజాగారు, బహుమతి ప్రదానోత్సవం రవీంద్ర భారతి నుంచి (హైదరాబాదు), రాణీ సీతయ్‌కి (మద్రాసు) ఎందుకు మార్చారనే విషయంతో ప్రారంభమైన కబుర్లు మూడున్నర గంటల సేపు విశ్వవిహారం చేశాయి. మధ్యలో కృష్ణమూర్తి అడిగారు ఇవి డైరీలో వచ్చేస్తాయా ? - అని ! 'పొరబాటున కూడా రావు' ఇది ప్రయివేట్ వరల్డ్ - అన్నాను. మనసున పరిమళించే స్నేహ సౌగంధికమది.

..... 10

ఏ ఊరెళ్లినా రిటర్న్ టికెట్ మద్రాసులోనే కొనుక్కు బయలు దేరడం అలవాటు. జవహర్ బాల భవన్‌లో వాసిరెడ్డి సీతాదేవికి కనపడి, అక్కడ కాసేపు కూచుని, వేడివేడియిడ్లీ తిని, స్టేషన్ కొచ్చి, బోగీకి అతికించిన లిస్టు చూసుకున్నాను. మొదట్లోనే నా పేరు ఉంది. నెంబర్‌ఒన్ లోయర్‌బెర్త్. సికింద్రాబాదు స్టేషనులో అయిదారు గురు బిలా బిలా ఎక్కారు. రైలు కది లాక, సామాను సర్దుకుంటూ ఆమె అడిగింది : ఏడో నెంబరు కూడా మాదే - అదీ లోయర్ బెర్తే - మీరది తీసుకోకూడదా ? - అని. సామాన్యంగా అయితే 'ఒకె' అని వుందును ; కాని, ఎందువల్లో అలా అనాలని అనిపించక, "నేను విజయవాడలో జర్నీ బ్రేక్ చేస్తున్నాను ; పదిలోపున విజయవాడ చేరుకుంటాం ; ఈలోగా నిద్దర పోరు కదా - టిసికి చెబుతాను మీకే యివ్వ మని" - అన్నాను. టికెట్ చెకింగ్‌కి వచ్చినప్పుడు ఆ టిసికి చెప్పాను - ఆయన సరేనన్నారు. ఇద్దరు పురుషులు, వారి భార్యలు, అందులో ఒకామె తల్లి గారు, ఒక పాప... పాప గ్రానీని పక్కకి తప్పించి విండోసైడ్ తీసుకుంది. నేను 'యసైడ్' చదువు కుంటున్నాను. ఒక అరగంట సేపు వాళ్లలోవాళ్లు మాట్లాడుకున్న తర్వాత, పార్టీని మేనేజ్ చేస్తున్నామె అడిగింది ; మీది హైదరాబాదా ? - అని. 'కాదు - పని మీద వొచ్చాను - మద్రాసు, మైలాపూర్' అన్నాను. మైలాపూర్ అనగానే ఆమె స్మృతిపథంలో ఏదో కదిలినట్టుంది. ఆ తర్వాత పేర డగటం, ఫలానా అని తెలుసుకోవటం, ఆంధ్రమహిళాసభ హాస్టల్, విద్యాలయ, అత్తగారు వెంకుమాంబ, సెక్రటరీ సుశీలాదేవి, తను ఆ హాస్టల్లో కొన్నాళ్లు పని చేయటం, సుశీలాదేవి సలహా మీద 'యావెరి'లో (తూకాల మిషనులకంపెనీ) చేరటం, వివాహం, పాప కలగటం, హైదారాబాదు ట్రాన్స్‌ఫర్ - వరసని చెప్పేసిందామె. "మహిళా విద్యాలయాని కొకసారి వచ్చారు మాలతీ చందూర్‌గారు - అప్పుడు చూశానామెని" - అన్నారు రాజ్యశ్రీ. కొత్త ప్రదేశాలు దర్శించటం ఆమెకి మహాసరదా. వెనకొకసారి కేరళ వెళ్లారట - మళ్లీ వెళ్తున్నారు. "దేవాలయాలకంటె ఆ కొత్త ప్రదేశాలు చూడటం నాకెంతోసరదా. కొండ లెక్కుతున్నప్పుడూ, నదీతీరాల నడుస్తున్నప్పుడూ కలిగే అనుభూతి నాకెంతో యిష్టం. పుస్తకాలేదో చదువుతాను గాని ఆ చదవడం కంటె కొత్త చోట్లు చూడటం ఎంతో సంతోషంగా ఉంటుంది. కాశ్మీరు నుంచి కన్యాకుమారి దాకా దేశం చాలా భాగం చూశాను. నాకొక్కటే కోరిక మానస సరోవరం చూడాలని," - అన్నారు రాజ్యశ్రీ. "ఇలస్ట్రేటెడ్ వీక్లీలో సుబ్రహ్మణ్య స్వామి నాలుగు మూడేళ్ల క్రితం వ్రాసిన ఆర్టికల్ చదివారా ?" అని అడిగాను. చదివానన్నారు. మానస సరోవరం, మంచు కరుగుతున్నప్పుడు వెలువడే శబ్దాలు, చుట్టూగల ఎనిమిది

ఆరామ వాటికలు, టిబెటన్ ప్రభుత్వం వారి అనుమతి పత్రం, యిలాటి వయాక "మీరక్కడికి వెళ్లడం సాధ్య పడే విషయం కాదేమో !" అన్నాను. "కేదారనాథ్ బదరీనాథ్‌లు వెళ్లాం - అదిమాత్రం చూడకుండా వుంటూనా?" అన్న ఆమె ఆశావాదం నన్ను ఆశ్చర్యపరిచింది. ఈమె కోరిక తప్పక నెరవేరుగాక - అని మనసులో అనుకున్నాను. ఈలోగా ఆమె భర్త మూర్తిగారు, ఆస్ట్రేలియాలో రెండేళ్లు వుండివచ్చిన ఆమె మేనమామ, ఆయన భార్య, పెద్దావిడ, పాప అందరూ పరిచయమైపోయారు. టిఫిన్లు పెట్టారు, చపాతీలు తినిపించారు - ఏవో ఏవో సంగతులు మాట్లాడుతూండగా యిట్టే వచ్చేసింది విజయవాడ. తిరుగు ప్రయాణంలో మద్రాసులో దిగినప్పుడు, మాయింటికి వచ్చి, మమ్మల్ని చూస్తామని చెప్పారు రాజ్యశ్రీ దంపతులు. రైలు ప్రయాణాల్లో ఏర్పడ్డ కొన్ని పరిచయాలు అభివృద్ధి జెందుతాయి ; మరికొన్ని ఆ జ్ఞాపకం మాత్రమే మిగిల్చి తెగిపోతాయి .... 'హోటల్ మమతా'లో శాస్త్రిగారే కౌంటర్ వద్ద ఉన్నారు. "మీ టెలిగ్రామ్ అందింది. టెలిగ్రామ్ రాకపోతే మాత్రం మీకు రూమ్ లేదంటామా?" - అన్నారాయన 'ఏ హోమ్ యవే ఫ్రమ్ హోమ్' అనే మాటకు అన్నివిధాలా అతికినట్టుంటుంది గోపాలరావుగారి 'మమతా' విజయవాడలో.

. . . . . 11

అయిదున్నరకి బేరర్ కాఫీ కప్పుతో బెల్‌నొక్కాడు ; ఆరున్నరకి శాస్త్రిగారు 'మీకోసం కారొచ్చింది' అని ఫోనులో చెప్పారు. 'స్వాతి' బలరామ్ ఫామిలీతో తిరుపతి వెళ్తూ ఆఫీసులోని రామకృష్ణకు 'వెహికిల్' అరేంజి చేయమని చెప్పి మరీ వెళ్లారట - మంచి మిత్రులంటే అలా ఉంటారు. బలరామ్ దంపతుల అభివృద్ధిని హృదయ పూర్వకంగా కాంక్షించే వారిలో మేమొకరం. 'స్వాతి' మంత్లీ ద్వారా స్వయంకృషితో పైకొచ్చి, 'స్వాతి' వీక్లీని ఎటువంటి 'లిటరరీ ప్రిటెన్షన్స్' లేకుండా సర్వజనామోదకరంగా, దిన పత్రికల బైప్రోడక్ట్‌సై నిలదొక్కుకున్న యితర వీక్లీలు కాంపిటేషన్ ఫీలయేటట్టు నిర్వహిస్తున్న వేమూరి బలరామ్ అభినందనీయులు. పాఠకులు అంతగా ఆదరిస్తున్నారూ అంటే పేజీ గెటప్, మేటరు, బొమ్మలు, అన్ని వయసుల వారిని ఆకట్టుకొనే శీర్షికలు యిన్ని వున్నాయి గనకనే స్వల్ప కాలంలో 'స్వాతి' వీక్లీ సక్సెస్ అయింది. అందుకు బలరామ్ గారి నిర్విరామకృషే కారణం. ఈ మధ్య 'ఉదయం' డెయిలీకి ఆయన యిచ్చిన యింటర్వ్యూ పాఠకాభిరుచిపట్ల ఆయనకు గల సదభిప్రాయాన్ని వ్యక్తం చేస్తోంది.... సరిగా ఏడు గంటలకి కారులో కూచున్నాను. బందరు వెళ్లి రావడం, విజయవాడలో చూడవలసిన వారిని చూడటం, యిలాటివయాక, ఏడున్నరకి స్టేషన్ కొచ్చి మెయిల్‌లో మద్రాసు.

14

'ఆనందభైరవి' ఆఫీసులో ఉషా రాణి పత్రికా గోష్టి. ఈ మధ్యనే ఆమె, దీప, రోహిణి మున్నగువారితో స్టేట్స్ లో (అమెరికా) నృత్య ప్రదర్శనలిచ్చి వచ్చారు. అమెరికా పదహారు పట్నాల లో, కెనడాలో నాలుగు చోట్ల, దారిలో లండన్‌లో రెండుసార్లు డాన్స్ పెర్ఫామెన్సెస్ యిచ్చిన ఉషారాణి, చాలా సంవత్సరాలుగా నాట్యకళకు అంకితమైన కళాకారిణి. ఆగస్టు 22వ తేదీన బయలుదేరి, అక్టోబరు అయిదుకి తిరిగి మద్రాసు చేరుకున్నారు.

. . . . . 18

ఈతరం వారి 'నవభారతం' కు వస్తానని చెప్పాను జగన్‌తో. బయలు దేరబోయే సమయానికి గోపాలరెడ్డి గారు రావటంతో, వారితో అమెరికన్ సెంటర్లోని 'డుకాకిస్, బుష్' ల ఎన్ని కల సంవాదం చూసేందుకు వెళ్లాను. ఇద్దరూ, ఎవరి దృక్పథాన్ని వారు, సహేతుకంగా వివరించారు. డెమొక్రాటిక్ అభ్యర్థి డుకాకిస్ నెగ్గాలని మనకి వున్నా నీగ్రో వోట్ల విషయంలో ఆయన వేసిన తప్పటడుగు, జార్జి బుష్‌కి విజయం చేకూరుస్తుందేమో ననిపించింది.

. . . . . 19

భారతీయవిద్యా భవన్‌లో ఫోరమ్ ఫర్ డెమొక్రటిక్ రైట్స్(Forum for Democratic Rights) మద్రాసు ప్రెస్ క్లబ్(Madras Press Club), ఆథర్స్ గిల్డ్ ఆఫ్ ఇండియా - మద్రాసు శాఖ (Authors Guild of India Madras Chapter) ది రైటర్స్ క్లబ్ మద్రాసు (The Writers Club, Madras) ఈ నలుగురూ సల్మాన్ రష్దీ సాటానిక్ వెర్సెస్‌పై (Salman) Rushdie's 'The Satanic Verses' భారత ప్రభుత్వవిధించిన నిషేధానికి నిరసనగా బహిరంగసభ జరిపారు. 'ఈపుస్తకం మనదేశంలోకి దిగుమతి కాకూడదని 'కస్టమ్స్ బాన్' విధించారు. ఈ నిషేధాజ్ఞ జారీ చేసినవారు పుస్తకం చదవలేదట. పత్రికలలోవెలువడ్డ సంగ్రహ భాగాలని బట్టి అది ఒక మతవర్గం వారికి అభ్యంతరకరంగా ఉండవచ్చునని భావించారట. ఇలా చేయటం ప్రజాస్వామిక హక్కులకు భంగకరం' - అన్నారు ఫోరమ్ కన్వీనరు లక్ష్మీనారాయణ్. పుస్తకం చూడకుండా, పుస్తకం బజార్లోకి రాకుండా నిషేధించడం సమర్థనీయం కాదు - అన్నారు ప్రెస్ క్లబ్ అధ్యక్షులు డి అంజనేయులు. "నేను పుస్తకం చదివాను. ఒకపాత్ర మహమ్మద్ ప్రవక్తని పోలివున్నదని విమర్శకులు అనుకోవడం తప్పితే, అందులో అభ్యంతరకరమైన విషయాలేమీలేవు. అది ఫిక్షన్ - కాల్పనిక రచనలను ఈవిధంగా నిషేధించడం మొదలు పెడితే మనం ఎక్కడికి వెళ్తాం ? సృజనాత్మక రచయిత స్వాతంత్ర్యాన్ని హరించడం వోపెన్ సొసైటీలో తగదు' - అన్నారు 'హిందూ' యన్ రామ్, సాటానిక్ వెర్సెస్‌లోని 'పాసేజెస్' కోట్ చేస్తూ !

.... "ఫిక్షన్ నేనంతగా చదవను

గనక నేను ఆపుస్తకం చదవకపోవచ్చు. కాని, ఈ నిషేధాజ్ఞ మాత్రం న్యాయ సమ్మతం కాదంటాను. శాంతి భద్రత లకు భంగం వాటిల్లుతుందని తోస్తే, ఒక పుస్తకాన్ని నిషేధించే అధికారం న్యాయస్థానానికుంటుంది గాని ప్రభుత్వానికి కాదు. ప్రభుత్వం ఈ విధమైన అర్డరు జారీ చేయడం ప్రజాస్వామ్య సూత్రాలకు విరుద్ధం"— అన్నారు అనుభవజ్ఞులైన మాజీ కేంద్ర మంత్రి సి సుబ్రహ్మణ్యం.... సల్మాన్ రష్దీ పుస్తకంలో స్థూలంగా ఏమున్న దంటే: ఇంగ్లీషు ఛానల్‌పై జరిగిన విమాన ప్రమాదంలో గిబ్రిల్ అనే ఫిలిమ్‌స్టారూ, చెంచా అనే ఒక ప్రఖ్యాత వ్యక్తీ నీళ్లలో పడతారు; ఆ పడ్డది నీళ్లలో అవటంవల్ల ప్రాణాలతో బయటపడి, ఒక పెద్దావిడ ఆశ్రయం పొందుతారు. గిబ్రిల్ శిరసు చుట్టూ ఒక తేజోచక్రమూ, చెంచా తల మీద కొమ్ములూ వస్తాయి. ఈ విధమైన ఫాంటసీతో, వారిద్దరూ తమ వెనకటి గాథ మర్చిపోవడమూ, జ్ఞాపకం తెచ్చుకోవడమూ ఇంగ్లండులో స్థిరపడ్డ 'ఇమిగ్రెంట్స్' చుట్టూ, వాస్తవమూ అద్భుతరసమూ మిశితమైన ఈ గాథ నడుస్తుంది - యన్ టి ఆర్, అమితాబచన్‌ల కారికేచరులతో! కథను ఎన్ని వంకరలు తిప్పినా చదివింప జేయడంలో బహు నేర్పరి అయిన రష్దీ పాఠకుని విస్మయ పరుస్తాడలు. ఈ పుస్తకం ఆరోపంతులో మహమ్మద్ ప్రవక్తని పోలిన పాత్ర ఉన్నదట. అది యాదృచ్ఛికమేగాని అసలు ప్రవక్తని ఉద్దేశించినది కాదు - నాకుగా నేను సృష్టించుకున్న పాత్ర - కాల్పనిక ప్రవక్త - అని రష్దీ సంజాయిషీ. ఈ పుస్తకం గురించిన వాదోపవాదాలు యిప్పట్లో సద్దు మణిగేటట్టు లేవు.

. . . . . 19

శ్రావణా మూవీస్ వారి 'అడవిలో అర్ధరాత్రి' పాటల ప్రదర్శన యమ్మెమ్ థియేటర్లో. 'పూచీ పూయని పూవులా - తెలిసీ తెలియని నవ్వులా - పులకించిందే నా కోరిక' (జాలాది గీతం) - అంటుంది దివ్య. మొత్తం అయిదు పాటలు. శశికుమార్ తెలుగు తెరకు పరిచయమవుతున్న ఈ చిత్రంలో దివ్య, అరుణలతో బాటు, పొట్టి ప్రసాద్, త్యాగరాజు మున్నగువారు న్నారు. దర్శకత్వం: కెయస్సార్ దాస్. నిర్మాత : శ్రావణ కుమారి ; సమర్పణ : శ్యామలాదేవి.

. . . . . 20

భాగ్యవతీ బాపూలు, 'సూర్యకాంతం' లోనూ, శ్రీదేవీ రమణలు 'ఆదిలక్ష్మి' లోను ఈ విజయదశమి రోజున ఒక ఇంటివారయారు - అంటే, కష్టపడి కట్టించుకున్న యిళ్లలో, స్వగృహాలలో స్థిరపడ్డారు - బాపు రమణల పేర్లకి మల్లేనే యిళ్లు కూడా పక్క పక్కనే గ్రీన్‌వేస్‌లోని చావలి అవెన్యూలో .... ఒక గృహప్రవేశం ఎనిమిదింపావుకి; మరొకటి నిముషం తక్కువగా ఎదినిమిన్నరకి

తెలుగు సారస్వతంలోను, తెలుగు చిత్ర సీమలోనూ బాపూ రమణల జంట, ఆ మైత్రీ లత, ఆ ఆత్మానుబంధం, ఆంధ్ర సరస్వతి హస్తద్వయ మనిపిస్తుంది. వారిరువురికీ, వారి కుటుంబాలకు మా మనఃపూర్వక శుభాకాంక్షలు ... వావలి అవెన్యూ నుంచి యింటికొచ్చి మాలతిని దించి, ఎవియమ్‌కి! గోపీకృష్ణ వారి 'యమధర్మరాజు' షూటింగ్ ప్రారంభోత్సవం. చాలా సంవత్సరాల తర్వాత సరోజాదేవి ఈ చిత్రంలో కనిపిస్తుంది 'హ్యూమరే అని బ్రాండ్ పడటం యిష్టం లేదు - సీరియస్ చిత్రం చేసి చూపిస్తాను' - అన్నారు దర్శకులు రేలంగి నరసింహారావు. కృష్ణంరాజు కాసేపు కబుర్లు చెప్పాక, 'యమధర్మరాజు' హీరో పేరా అని అడిగిన ప్రశ్నకు, 'కాదండీ - అసలు పేరు ధర్మారావు - అందరూ యమధర్మరాజని పిలుస్తారు' - అని వివరించారు రచయిత ఓంకార్.... అక్కడ నుంచి మరొక ప్రారంభోత్సవానికి – సుదర్శన్ ఎంటర్‌ప్రయిజెస్ వారి చిత్రం. దర్శకులు విశ్వనాథ్ గంగిరెద్దుల వారి ఆచారాలూ పద్ధతులూ స్టడీ చేస్తున్నారు. ఇందులో నాగేశ్వరరావు గంగిరెద్దులు ఆడించే మనిషి. వంశపారంపర్యా వచ్చే ఆ వృత్తి, వారి అలవాట్లూ తెలుసుకుంటేనే గాని పాత్రకు జీవం రాదు. 'ప్రభువుగారికీ దణ్ణంపెట్టూ - పాదం వంచీ భక్తిని పెట్టూ పట్టు - శాలువలు కప్పేదరంటా - కాసులు మువ్వలు కట్టెదరంటా డూ డూ డూడూ యెంకన్నా' - (బాపిరాజు) - అనితండ్రి చేత అనిపిస్తారు. కొడుకు నాగార్జున్ కలెక్టరవుతాడు. నాటకీయ లక్షణం ఆ విధంగా చోటు చేసుకుంటుంది.

. . . . . 22

"బాంకుల్లో పనులు మందకొడిగా సాగుతున్నాయనే ఫిర్యాదు సర్వత్రా వినిపిస్తూ వుంటుంది. బిజీటైములోగాక సామాన్య సమయాల్లోవస్తే ఆలస్యమవదు. సోమవారాలప్పుడు, నెల మొదటివారంలోను, కౌంటర్ తెరిచిన గంటా గంటన్నరలోనూ వుక్కిరిబిక్కిరిగా వుండే మాట నిజమే! రద్దీ తక్కువగా వున్న టైము తెలుసుకు వెళ్తే మీరు చిరాకు పడవలసిన అవసరం ఉండదు - అన్నారు మౌంట్‌రోడ్ స్టేట్‌బాంక్ మేనేజరు టివి శ్రీనివాసన్, కన్స్యూమర్ ప్రొటెక్షన్ ఫోరమ్ వారి సమావేశంలో Consumer Protection Forum - 51, Dr. Radhakrishnan Road, Madras 600 004) సుందరీ మణి ఆహూతులకు స్వాగతం తెలిపారు.

27

హేమారామేశం దంపతుల కుమార్తె సౌ॥ కల్పనకు, చి॥ రాకేష్‌కు రాజేశ్వరీ కళ్యాణమండపంలో సాయింత్రం 7గం॥ 38ని॥లకు వేదోక్త విధులతో వివాహం జరిగింది. బంధుమిత్రులనేకులు వచ్చి నూతన వధూవరులకు శుభాకాంక్షలు తెలిపారు. మూడు ముళ్లు పడ్డాక నవదంపతులు స్టేట్స్‌కి

....అక్కడి నుంచి వచ్చారు - మళ్లీ అక్కడికి వెళ్లారు.

. . . . . 31

చోళాలో అల్లు అరవింద్ లంచ్ అని ఫోనులో చెప్పారు 'లంచ్' అంటే పన్నెండున్నర నుంచి రెండున్నర దాకా! లోగడ 'చక్రవర్తి' పిక్చర్ తీసిన వసంతా ఆర్ట్ వారి ప్రెస్‌మీట్. ఇరవై అయిదు రోజులలో ఒకే షెడ్యూల్ లో పూర్తి చేశారు - వరకట్నం చావులని, వరకట్న సమస్యని యితి వృత్తంగా తీసుకున్న ఈ చిత్రాన్ని! దర్శకులు రవిరాజా పినిశెట్టితో పని చేయడం తనకెంతో సంతోషాన్ని ఇచ్చిందని కథానాయకుడు రాజశేఖర్ అన్నారు. మూడుపాటలూ రెండు ఫైట్సూవున్న ఈ చిత్రంలో కథా నాయిక సీత. భాగ్యలక్ష్మి అనే నూతన నటి పరిచయమవుతోంది. సుధాకర్, సాక్షిరంగారావు, దేవదాస్, బ్రహ్మా నందం మున్నగు వారున్నారు. మాటలు : సత్యమూర్తి ; పాటలు : వేటూరి ; శ్రీహర్ష. నిర్వహణ : నారా యణరావు ; నిర్మాత : కె వెంకటేశ్వర రావు.... మీరిది చదివే నాటికి పిక్చర్ రిలీజై ఉంటుంది.

1988 నవంబరు 02

'ఎదమీటే వానజల్లు పడగా - పెదవుల్లో పాట తుళ్లిపడదా' (సీతా రామశాస్త్రి) - బాలూ, జానకీ పాడగా నూతన తారలు వాణీ ఆనంద్‌లపై ఊటీలో చిత్రీకరించారు - కళ్యాణి కంబైన్స్ వారి 'ధర్మతేజ'లో.... 'చిక్కె నమ్మ చక్కనమ్మ జంట - ఏ చిక్కులు లెక్క చెయ్యనంట - అ ఆటలై' (సీతారామశాస్త్రి) ఇది బాలూ సుశీలలు పాడగా, కృష్ణంరాజు, రాధిక లపై చిత్రీకరించారు. జగ్గయ్య, రంగ నాథ్, కోట శ్రీనివాసరావు, శివకృష్ణ, రాజేశ్వరి, శైలజ, భీమేశ్వరరావు మున్నగువారున్న ఈ చిత్రంలోని పాటలు 'దేవి – శ్రీదేవి' చూపించి, ఆ తర్వాత థియేటర్‌కి అతి సమీపంలో వున్న వారి ఆఫీసులో ప్రతికాగోష్ఠి జరిపి, చిత్రంలోని హైలైట్స్ చెప్పారు. దర్శకత్వం : పేరా నిర్మాణం : కళ్యాణి కంబైన్స్.

1988 నవంబరు 03

ఏ నాడో ప్రారంభించిన మక్కళ్ తిలకమ్‌వారి 'దంపతులారా- వర్థిల్లండి' కారణాంతరాల వల్ల వాయిదాపడుతూ వచ్చి, ఇప్పటికి పూర్తియింది. సత్యా స్టుడియోస్‌లోయివ్వాళ పాటలు చూపిం చారు పాటలన్నీ శ్రావ్యంగా వున్నాయి. కథాబలం గల ఈ చిత్రానికి విజయ నిర్మల దర్శకురాలు. 'పిన్ని'కిముందు రిలీజ్‌గావచ్చు. పి ఆర్‌ఒ: మెరువు శ్రీకష్ణ....

—యవ్నార్ చందూర్



స్త్రీలు అందంగా కనపడటానికి కారణం ఒక్కటే! వారు తమ ఆంత ర్యంలో ఏమున్నప్పటికీ పై ప్రవర్త నలో మాత్రం నాజూకులు విడనాడరు.

—క్రిస్టి